చరిత్రకందని శైవక్షేత్రం

# కూసుమంచి గణపేశ్వరాలయం




కట్టా శ్రీనివాస్

లోచన అధ్యయన వేదిక

చరిత్రకందని శైవక్షేత్రం

**కూసుమంచి గణపేశ్వరాలయం**

కట్టా శ్రీనివాస్

Kusumanchi Ganapeswaralayam

*By Katta Srinivasa Rao*

*Lochana Study Club Prachuranalu*



First Edition : Shivaratri, 17 Feb 2015

Copies : 500

Price : Rs. 30

Cover Design : VMRG Suresh

Typesetting : Katta Srinivas

Printing : Cosmic Printers, Chatta Bazar, Hyderabad

For Copies

> **Ganapeswaralayam, Kusumanchi**

> Arvapally Veeraswamy, Teacher, Kusumanchi, 90067348

> Dhana Murthy, Teacher Kusumanchi , 9948817571

> Ramesh Fancy & Metal Stores, Kusumanchi. 98483 40321

> Bandi Seshaiah, Kallur. 9948775805

> Kapila Ram Kumar, Librarian - BVK, Khammam. 9849535033

> G Rama Krishna, Librarian, Govt Library, Sathupally. 9949804565

*And Other major book stores*

**Katta Srinivasa Rao, Author,**

D.No: 9-43 Ayyagaripeta,

Opp APDDC (Milk Booth),

Road Number 05, Gandhi Nagar,

Sathupally-507 303,

Khammam District,Telangana.

Cell : 9885 133 969, 9030 133 969

Email : nivas.katta74@gmail.com

Blog : www.antharlochana.blogspot.in

*మన చరిత్రను మనమే కాపాడుకుందాం,*

*ఖమ్మం నా సొంతగడ్డ అనుకునేవారందరికీ ...!*

# రండి ... గుళ్లోకి వెళ్దాం !

# విశిష్టతలూ, చారిత్రక నేపథ్యం

*ప్రాకారో జయతి త్రికూటమ్ అభితస్థత్ తేన నిర్మాపితః*
*సుశ్లిష్టైః క్రమశీర్షకై రుపచితో నీలోపలైః కల్పితః।*
*యశ్చా లక్షిత సంధిబంధ కథనాదేకాశిలా తక్ష కైః*
*సంతక్ష్యైవ మహీయసీమ్ ఇవ శిలాం యత్నాత్ సముత్తారితః ॥*

**నల్లని** రాళ్ళను సమానంగా నున్నగా చెక్కి, సన్నిహితంగా కూర్చి నిర్మించిన త్రికూట ప్రాకారం విలసిల్లుతూ ఉంది. అతుకుల గీతలు కనిపించకుండా ఏకశిలా నిర్మితంగా భాసించే ఈ ప్రాకారాన్ని మహాప్రయత్నంతో శిల్పులు నిర్మించారని అంటూ గణపతిదేవుని కాలం నాటిదయిన కొండపర్తి శాసనం చెపుతోంది. ఇలా కాకతీయుల నిర్మాణ ప్రతిభకు అద్దంపట్టే వారికాలం నాటి గొప్ప నిర్మాణమే ఈ కూసుమంచి గణపేశ్వరాలయం.

గుడి అంటే కేవలం ఆరాధనకు, మొక్కుబడులు చెల్లించుకునేందుకే కాదు. అంతకంటే ముఖ్యమైన సామాజిక క్షేత్రంగా పనిచేసిందని, సమాజానికి తప్పనిసరి అవసరంగా గుడి వుండేదని ప్రముఖ చరిత్రకారులు కె.ఏ.నీలకంఠశాస్త్రి చెప్పిన మాటలు ఇక్కడ ఇప్పుడు మరోసారి గుర్తుచేసుకోవాలి.

భూస్వామిగా, యజమానిగా, సరుకులు, సేవల వినియోగదారుగా, బ్యాంకుగా, పాఠశాలగా, వస్తుప్రదర్శనశాలగా, వైద్యశాలగా, రంగస్థలంగా ... ఒక్కమాటలో చెప్పాలంటే అత్యుత్తమమైన కళలూ, నాగరికతలకు సంబంధించిన కేంద్రబిందువులుగా మధ్యయుగాల్లో దేవాలయాలు విలసిల్లాయి. ధర్మబద్ధత, మానవతతో సమాజాన్ని నియంత్రించిన మరోవ్యవస్థ మానవ చరిత్రలో లేదు.

గొప్ప చరిత్రకారుని మాటల్లోని నిజం మనకు అర్థం కావాలంటే శతాబ్దాల కాలాన్ని ఎదురొడ్డి నిలచిన ఇటువంటి దేవాలయాలను మరింత క్షుణ్ణంగా అధ్యయనం చేయాలి. వ్యవస్థకు భరోసానిస్తూ బలోపేతం చేసుకునే పద్ధతులను నేటి పరిస్థితులకు అనువుగా ఏర్పాటు చేసుకోగలగాలి.

ఆంధ్రదేశంలో 300 సంవత్సరాలకు పైగా సాగిన కాకతీయుల పరిపాలన అంటే

కేవలం ఒక రాజరికవ్యవస్థ కాలంగా మాత్రమే చూస్తే సరిపోదు. గొలుసుకట్టు చెరువులతో దేశాన్ని సస్యశ్యామలం చేసి, ఆకలిబాధలను తీర్చడం గురించిన అర్థంలో తీసుకోవాలి. రమణీయమైన నిర్మాణశైలితో అర్థవంతంగా నిర్మించిన ఆలయాలు, రాజభవనాలు, గ్రామాల అమరిక వెనుక వున్న సైన్సును అర్థం చేసుకోవాలి. అదే శిల్పంలో వివిధ అంశాలను పొందుపరచిన విధానం తెలుసుకోవాలి. ఆర్థికంగా పరిపుష్టంగా వుండేందుకు తీసుకున్న చర్యలను ఆకళింపు చేసుకోవాలి. కళలకూ, సాహిత్యానికి ఇచ్చిన విలువను అవగాహన చేసుకోవాలి. పేరిణి లాంటి నాట్యాలు ఉత్తేజాన్ని రగిలించేందుకు ఉపయోగపడ్డ విధానాన్ని విశదంగా గమనించాలి.

# ఉనికి

తెలంగాణా రాష్ట్రంలోనే అతిపెద్ద శివలింగం కూసుమంచి గణపేశ్వరాలయంలోని బృహత్ శివలింగం. దేశంలోనే చెప్పుకోదగిన స్థాయిలో దీని పరిమాణం వుంది. అత్యంత చాతుర్యాన్ని కనబరిచిన ఆలయ నిర్మాణం, విశేషమైన వాస్తుపద్ధతిలో వున్న ఉప ఆలయాలు, సుమారు వెయ్యేళ్ళ చారిత్రక ఉనికి, చరిత్రకు ఆనవాళ్ళుగా నిలిచిన వీరగల్లులు, ఊరికి అనుబంధంగా నిర్మించిన గంగాదేవి చెరువు ఇక్కడి గణపేశ్వరాలయ ప్రత్యేకతను చాటుతున్నాయి.

ఖమ్మం-హైదరాబాద్ జాతీయ రహదారిపై ఖమ్మం నుంచి 20 కిలోమీటర్ల దూరంలో ఉన్న కూసుమంచి గ్రామంలో ఈ గణపేశ్వరాలయం వుంది. సూర్యాపేట నుంచి ఖమ్మం రోడ్‌లో 40 కిలోమీటర్ల దూరంలో ఉంది. హైదరాబాదునుంచి 170 కిలోమీటర్లు, వరంగల్ నుంచి ఖమ్మంమీదుగా 130 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. విజయవాడ నుంచి 126 కిలోమీటర్ల దూరంలో వుంటుంది. ఖమ్మం చరిత్రను గమనిస్తే అప్పట్లో రాజధానులుగా వెలుగొందిన నేలకొండపల్లి మరియు ముదిగొండ చాలా దగ్గరగా వున్నాయి. అప్పటి విష్ణుకుండినుల పాలనలో పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన ప్రాంతం, అతి పెద్ద బౌద్ధారామం వున్న ప్రదేశం మరియు భక్తరామదాసుకు పుట్టినిల్లు అయిన నేలకొండపల్లికి 20 కిలోమీటర్ల లోపు దూరంలోనే కూసుమంచి ఉంటుంది. చాళుక్యవంశం ముదిగొండ ప్రాంతంనుంచి పరిపాలన చేయడం వల్లనే ముదిగొండ చాళుక్యులుగా పేరుపొందారు. ఆ ముదిగొండ కూడా పాతిక కిలోమీటర్ల దూరలోనే వుంది. ఏరియల్ డిస్టెన్స్ పద్ధతిలో మరేదైనా దారి ఉంటే ఈ దూరం మరింత తగ్గుతుంది. పర్యాటక ప్రాంతంగానూ, చారిత్రక




అధ్యయనానికి ఊతాన్నిచ్చే ప్రాంతంగానూ దీనికి ప్రాముఖ్యత ఉంది. కూసుమంచి గ్రామానికి ఈశాన్యదిశగా ఈ గణపేశ్వరాలయమూ దీని ఉపాలయాలూ నెలకొనివున్నాయి. భౌగోళికంగా అక్షాంశము: 17°23’0.85" రేఖాంశము: 79°95’1.09" లపై వుంది.

## ఇలా వెలుగులోకి వచ్చింది ...

**కూసుమంచి** గ్రామానికి సుమారు 2 కిలోమీటర్లు ఎడంగా ఊరిబయట పొలాల్లో సర్వేనంబరు 636లో కేవలం పాడుబడిన శిధిలాల్లాగా మాత్రమే ఈ దేవాలయం వుండేది. నిండా పెరిగిన పిచ్చిమొక్కలు, పురుగూ పుట్రాతో లోపటికి కాలుపెట్టాలంటేనే భయపడేలా వుండేది. పశువుల కాపర్లకో లేదా ఊసుపోక ఆటలాడుకుందామని వచ్చేవాళ్ళకో ఆవాసంగా వుండేది. 2001లో కూసుమంచి పోలీస్ స్టేషన్‌లో సర్కిల్ ఇన్‌స్పెక్టరుగా పనిచేస్తున్న సాధు వీరప్రతాప్ రెడ్డి గారి చొరవతో దేవాలయంలో మళ్ళీ దీపం వెలిగించటం ప్రారంభమైంది. ఆయనను ఆకర్షించింది కూడా ప్రధానంగా ఈ అతిపెద్ద శివలింగమేనని చెప్తున్నారు. ఈ ఆలయాన్ని పునరుద్ధరించేందుకు పోలీసు సిబ్బందితో పాటు గ్రామస్తుల సహాయ సహకారాలను ఆయన తీసుకున్నారు. అప్పటినుంచి నిత్య పూజలే కాకుండా కళ్యాణ మహోత్సవాలు, ఉత్సవాలూ జరుగుతున్నాయి. శివునికి ప్రీతి పాత్రమైన సోమవారం

రోజున భక్తులు ఎక్కువగా వస్తుంటారు. ప్రత్యేకంగా శివరాత్రి పర్వదినం రోజునైతే లక్షలాది మంది భక్తులు గణపేశ్వరాలయాన్ని సందర్శించుకుంటున్నారు. చుట్టుపక్కల ప్రాంతాల వారే కాక ఇరురాష్ట్రాల నలుమూలలనుండి కూడా ఆలయసందర్శన చేసుకుంటారు. సిఐ ప్రతాప రెడ్డిగారి తర్వాత కూసుమంచి సర్కిల్‌కు వచ్చిన మరికొందరు పోలీసు అధికారులు బాల కిషన్, సాయిబాబా, వెంకట్రావు, సునీతారెడ్డి, నరేష్ రెడ్డి మొదలైనవారుకూడా అదే ఆనవాయితీని కొనసాగించి ఆలయం అభివృద్ధికి తమ సహాయ సహకారాలనందించారని గ్రామ ప్రజలు చెపుతారు. ప్రస్తుతం దేవులపల్లి శేషగిరిశర్మ గారు పూజారిగా పనిచేస్తున్నారు. 2002 నుంచి దేవాదాయ శాఖ ఈ ఆలయాన్ని తన ఆధీనంలోకి తీసుకుని కొంతమేరకు అభివృద్ధి కార్యక్రమాలను చేపట్టడంతో పర్యాటక ప్రాంతంగా కొంత అభివృద్ధి చెందింది.

## కూసుమంచి ఊరిపేరు వెనుక ...

**కాకతీయుల** కాలంలో దేవాలయాలను కేవలం రాజధాని ప్రాంతంలోనో, పెద్దపెద్ద జనావాసాలున్న చోట మాత్రమే కాకుండా రాజ్యం నలుమూలలా విస్తరించేలా కట్టారు. ఆలయం, నగరం, నీటివసతిని ఒక క్రమబద్ధమైన అమరికలో వుండేలా జాగ్రత్తపడ్డారు. కాకతీయ నిర్మాణశైలికి పరాకాష్టగా భావించే రామప్ప దేవాలయం కూడా పాలంపేట అన బడే చిన్న ప్రాంతంలో నిర్మించారు. అది రాజధానిగానో, వర్తక వ్యాపారాలూ నిర్వహించిన అతిపెద్ద పట్టణ ప్రాంతంగానో ఎక్కడా ఆధారాలు దొరకలేదు. పైగా మొన్నమొన్నటి వరకూ కూడా తుప్పలూ, చెట్లతో నిండిన మారుమూల అరణ్య ప్రాంతంగా వుంది. ఖమ్మంజిల్లాలోని గణపేశ్వరాలయం నిర్మాణం కోసం ఎంచుకున్న కూసుమంచి ఊరు పేరును గమనిస్తే ఇది మొదటినుంచి స్వల్ప జనావాస ప్రాంతమేనేమో అనిపిస్తుంది.

పేరునుబట్టి చూస్తే 'కూసు 'అంటే చిన్న, సులభసాధ్యమైన అని అర్థం. కూసుమంచి అంటే చిన్నఊరు అనే అర్థంలో తీసుకోవచ్చు. అభ్యాసం కూసు విద్య అనే సామెతలో ఈ పదం ఇప్పటికీ వాడుకలోనే వుంది. వైష్ణవ సంప్రదాయాలలో ఒకటైన సాతాని మతం (చాత్తాద వైష్ణవం)లో కూడా కూసుమతం, కూచిమతం అనే ఒక శాఖ వుంది.

కొంచెం అనేందుకు కూసింత, కూసంత అనే పదాలను కాస్తంత అనే రూపంలోనూ వాడుతున్నాం. కూచి అంటే కూడా చిన్న అనే అర్థం వుంది. కూచికుండ అనేది ఇలా

వాడుకలోకి వచ్చిందే. 18వ శతాబ్దంలో కూచిమంచి జగ్గకవి (చంద్రరేఖా విలాపం అనే శృంగార ప్రబంధము, కాకతీయుల చారిత్రక వివరాలను కూడా తెలిపే సోమదేవ రాజీయము వంటి గ్రంథాల రచయిత), కూచిమంచి తిమ్మకవి (పుదుచ్చేరి లోని కామ గ్రంథమాల సంపాదకులు) ఈవిధమైన ఇంటిపేరుతో ప్రసిద్ధులు.

## గ్రామంలో చెప్పుకునే కథ

ఈ బృహత్తర ఆలయం గణపతిదేవుని కాలంలో ఆయన గురువు విశ్వేశ్వరస్వామి నిర్వహణలో కట్టించబడిందని, గణపతిదేవుడు తనకు అనేక విజయాలను ప్రసాదించిన శివుడికి భక్తిపూర్వక కృతజ్ఞతగా నిర్మించిన అనేక ఆలయాలలో ఇదొకటని చెపుతారు. కూసుమంచి గ్రామం ఆ కాలంలో  కూడా చాలా చిన్న ఊరుకావడంతో దేవాలయ నిర్మాణానికి ఓరుగల్లు ప్రాంతం నుంచి అనేకమంది నిపుణులను, కూలీలను రప్పించారని. వారి పనిని పర్యవేక్షించే నిర్వాహకుడికి ఒక కన్ను, ఒక చేయి, ఒక కాలు వుండేదట. అతనికి రోజు తల్లి భోజనం తీసుకుని వచ్చి ఇచ్చి వెళుతుండేదట. భోజనం అందజేసిన తర్వాత వెనక్కి తిరిగి చూడకుండా వెళ్లమని ఇతను కోరాడట. ఆమె రోజూ అలాగే చేస్తూ వుండేది. దేవాలయ నిర్మాణం దాదాపు చివరికి వచ్చింది. అసలు ఇలా వెనక్కి తిరిగి చూడొద్దని ఎందుకన్నాడా అనే అనుమానం ఆమెను నిరంతరం పీడించేది. ఈ ఉత్కంఠతను తట్టుకోలేక ఒకరోజు భోజనం అందజేసి వస్తూ వస్తూ ఈ విషయాన్ని తెలుసుకోవాలనే ఉత్సాహంతో వెనక్కి తిరిగి చూసిందట. ఆ మరుక్షణమే అతడు రక్తం కక్కుకుంటూ చనిపోయాడనీ చెప్పుకుంటారు.

కథలో అతని ఆకారం విచిత్రంగా వుండటాన్నిబట్టి ఈ బృహత్తర ఆలయ నిర్మాణంలో గ్రహాంతరవాసుల సహకారం వుందేమోననే అనుమానాన్ని కూడా కొందరు వ్యక్తం చేస్తున్నారు. ఒక మహత్తర యాంత్రిక, తాంత్రిక లేదా మాంత్రికశక్తి పనిచేయనిదే ఇంతటి బరువైన రాళ్ళను అంత ఖచ్చితంగా చెక్కుకుంటూ ఇంటర్‌లాకింగ్ విధానం ద్వారా పిల్లలు లెగోబ్రిక్స్ (వివిధ ఆకారాలలో వున్న ముక్కలను వేర్వేరు పద్దతులలో కలపటం ద్వారా నిర్మాణాలను తయారుచేసుకునే పిల్లల ఆటవస్తువు పేరు ఇది, లెగో అనే కంపెనీ తయారు చేసిన ఇటుకల వంటివి కనుక వీటికి లెగోబ్రిక్స్ అంటారు)ను బిగించినట్లు బిగించుకుంటూ రావడం, సరిపడకపోతే మరోసారి తీసి సరిచూసుకోవడం మామూలు మానవశక్తికి సాధ్య

పడేది కాదు అంటుంటారు. కథల్లోనూ, వ్యాఖ్యానాల్లోనూ ఎంత నిజం, ఎంత కల్పితం వుందనేది నిర్ధారించలేకపోయినప్పటికీ చరిత్రను అర్థం చేసుకునేందుకు ఏ చిన్న ఆధారమైనా విలువైనదే. ఈ కథ మొత్తంలో క్రేన్లూ, ప్రొక్లెయిన్లూ లేని ఆ కాలంలో కేవలం మానవ శక్తితో ఇంత పెద్ద పెద్ద రాళ్లను ఇంతదాకా ఎలా తరలించారు? వాటిని ఒక వరుసలో చెక్కముక్కలు పేర్చినంత సులభంగా, సున్నితంగా, ఖచ్చితంగా వీటిని ఎలా పేర్చారు అనేది అతి పెద్ద ఆశ్చర్యమే. నిశితంగా పరిశీలించినపుడు మరికొంత ఫినిషింగ్ పనులు పూర్తికాకముందే ఏవో బలమైన కారణాల వల్ల ఆలయ నిర్మాణం అర్ధంతరంగా ఆపివేసి వుంటారేమో అనే అనుమానం కలుగుతుంది.

## కూసుమంచి ఆలయశిల్పాలూ, శిల్పరీతి !

శిల్పకళను ఆంగ్లంలో స్కల్ప్చర్ అంటారు. లాటిన్ పదం స్కల్పెరీ అంటే కోయడం అనే అర్థం. ప్రకృతిలో కనిపించే విషయాలనే కాదు, మానవుని హృదయంలో పుట్టే భావాలకూ రూపకల్పనం చేయటం ఈ కళలోని ప్రత్యేకత. ఒక జాతి సంస్కృతి, నాగరికత, కళా వైభవాలను వెల్లడిచేసే శక్తి దీనికుంది. అందుకే తరాల వెనకటివారి ఆలోచనలకు ప్రత్యక్షసాక్ష్యాలుగా నిలచిన ఈ స్వల్పఆధారాలను అమూల్యమైనవిగా భావించాలి. వీటిద్వారా వాళ్ళని అర్థం చేసుకునే ప్రయత్నం చేయకపోతే కొనప్రాణాలతో మిగిలిన అవకాశాన్ని పూర్తిగా పోగొట్టుకున్నట్లే అవుతుంది.

కాకతీయులు వాస్తుపద్ధతులను, సాంప్రదాయక పద్ధతులను అనుసరిస్తూనే స్థానిక సాంప్రదాయ శైలికి తమ అభిరుచులను జోడించారు. అలంకరణలలో కాకతీయ సంస్కృతినీ, పద్ధతులను తెలిపే శిల్పాలను చేర్చటంలో ప్రత్యేకత చూపారు.

దేవాలయం కాకతీయుల కాలానిదే అని నిర్ధారించుకునేందుకు మనకు పటిష్టంగా కనిపించే ఆధారం దేవాలయ నిర్మాణరీతి. దీనిని జాగ్రత్తగా పరిశీలించడం ద్వారా ఈ విషయాన్ని అర్థంచేసుకోవచ్చు. ఈ ఆలయం రామప్ప ఆలయ నిర్మాణాన్ని చాలావరకూ పోలి వున్నప్పటికీ ఆలయంలో రాళ్ళను అమర్చిన విధానం రామప్ప కంటే భిన్నంగా వుంటుంది. పాలంపేటలో ఆలయం కోసం శిల్పులను ఎంచుకునేందుకు గణపతిదేవుని గురుతుల్యుడు విశ్వేశ్వరశర్మ ఒక పరీక్ష పెట్టారట. ఆ పరీక్షలో కూసపు కొలత, రంధ్రపు కొలతలను ముందుగా తీసుకుని. వాటిని వేర్వేరుగా తయారుచేయాలి. తొలిప్రయత్నంలోనే అవి కొంచెం వదులు కానీ, బిగుతుగానీ కాకుండా ఖచ్చితంగా బిగించగలగాలి. దీనిలో





బాగా సరిపోయేలా తయారుచేసిన యువకుడైన రామప్ప ఎంపికయ్యాడనేది ఒక కథనం. దీని ఆధారంగా గమనిస్తే గణపేశ్వరాలయ ప్రౌఢనిర్మాణ శైలికి విశ్వేశ్వరశర్మ వంటివారే కారణమయివుండొచ్చు అనిపిస్తుంది. రామప్పలోని సుందరమైన శిల్పాల నిర్మాణంలోనూ, నందివిగ్రహాన్ని జీవకళ ఉట్టిపడేలా మలచడంలోనూ రామప్ప ప్రజ్ఞాపాటవాలు, నైపుణ్య చతురత కన్పిస్తాయి. సాలభంజికల సౌందర్యారాధనలో అతని యవ్వన ప్రభావం కనిపిస్తుంది. కానీ కూసుమంచి గణపేశ్వరాలయ నిర్మాణాన్ని పరిశీలిస్తే రాతిపై రాతిని ఖచ్చితంగా పేర్చుకుంటూ రావడంలో అత్యంత నిరాడంబరమైన గాంభీర్యత కన్పిస్తుంది. ఒక ప్రౌఢత్వం ప్రస్ఫుటమవుతుంటుంది. అందుకే ఈ ఆలయం గణపతిదేవుని కాలంలో శిల్పి రామప్పకంటే పెద్దవాడయిన విశ్వేశ్వరాచార్యుని పర్యవేక్షణలో నిర్మించబడింది అంటే నిజమేనేమో అనిపిస్తుంది.

సాలభంజికలు, మదనికలు వంటి అలంకారశిల్పాలు ఈ ఆలయంలో లేవు. మూలవిరాట్టుగా ప్రతిష్టించిన శివలింగం మాత్రం చాలా ప్రత్యేకమైనది, బృహత్తరమైనది. ఓరుగల్లు, రామప్పలలోని మూలవిరాట్టుగా వున్న శివలింగాల పరిమాణాలకంటే ఇది మరింత పెద్దదిగా వుంది. లోపలి శివలింగం, దానికంటే ఇక్కడే స్థూలంగా కనిపించే మరో మహాలింగం గురించి తర్వాతి వివరణల్లో తెలియజేసాను.

స్థూలంగా ఆలయనిర్మాణాన్ని గమనిస్తే కాకతీయులు భారతీయ శిల్పసంప్రదాయంలో విశిష్టమైన వేసర శిల్పరీతిని అనుసరించారు. దక్షిణ భారతదేశంలో ద్రవిడ సంప్రదాయం, తూర్పు,ఉత్తర భారత దేశాలలో నాగర సంప్రదాయం ప్రచారంలో వున్నప్పటికీ కాకతీయులు తమదైన ప్రత్యేకతను నిలుపుకునేందుకు వారి శిల్పరీతిలో విశిష్టతను ప్రదర్శించుకునేందుకు ఈ సంప్రదాయాన్ని అనుసరించివుంటారు. దేవాలయం పునాదుల నిర్మాణం నుంచి శిఖరం వరకూ గల కొలతలు, గర్భాలయపు రూపురేఖల నుండి స్తంభాల విన్యాసం, రంగమండపము, ఉపరంగమండపము నిర్మాణము అన్నీ ఒకే పద్దతిలో కనిపిస్తాయి. ఇలా ఒకే పద్దతిని వారి పరిపాలనాకాలంలో నిర్మింపబడిన ఏ ఆలయానికైనా వర్తింపజేయటంతో అది కాకతీయ శిల్పమే అని కనుగొనేందుకు వీలుగావుంది. అలాగే కాకతీయ శిల్పులు ఆలయాల అంతర్భాగంలో చూపిన సున్నితమైన పనితనం బయటి భాగంలో చాలాచోట్ల చూపలేదు. అదే హోయసలులు ఆలయాల బయటివైపున పాదపీఠిక నుంచి శిఖరం వరకూ ఏమాత్రం విరామం లేకుండా వారి ప్రతిభనూ, నైపుణ్యాలనూ శిల్పాలలో చూపారు. కూసుమంచి గణపేశ్వరాలయంలో లోపలి విగ్రహంలో కానీ, అంతరాలయ శిల్పాలలో కానీ అత్యద్భుతమైన పనితనం కనిపిస్తుంది. కానీ బయట పెద్దగా అలంకరణలు లేవు.

## కాకతీయ రాజుల నిర్మితమే ఈ ఆలయం

ఈ ఆలయం కాకతీయుల కాలంలో నిర్మితమైనట్లు చారిత్రక ఆధారాల వల్ల తెలుస్తోంది. సుమారు 300 సంవత్సరాల పాటు దక్షిణ భారతదేశాన్ని పాలించిన కాకతీయులది ఆంధ్ర దేశచరిత్రలో ఒక ప్రత్యేకమైన అధ్యాయం. గొలుసుకట్టు చెరువులూ, వివిధ అంశాలను విశదీకరించే అపార శిల్పసంపద, చారిత్రకాంశాలకు ఆధారాలుగా నిలచే అనేక శాసనాలు, ఆధ్యాత్మిక శోభను విస్తరింపజేసే దేవాలయాలు ఎన్నో కాకతీయుల పాలనా వైభవానికి మచ్చుతునకలు.

ఆనాటి రాజులు, సామంతులూ, దండనాయకులూ యుద్ధాలలో గెలిస్తే దేవాలయాలు

కట్టించారు. విజయాన్ని సూచించేదిగానో పాపపరిహారంగానో దేవాలయాన్ని నిర్మించేవారు. దానితో ముడిపడి నగర నిర్మాణం మరియు అభివృద్ధి వుండేవి.

సాధారణంగా ఆలయాన్ని నిర్మించినవారి పేరునే ఆలయాలకు పెట్టేవారు. వరంగల్లు వేయిస్తంభాల గుడిలో రుద్రదేవ మహారాజు ప్రతిష్టించిన ఈశ్వరుడు రుద్రేశ్వరుడుగా , బేతరాజు ప్రతిష్టించిన ఈశ్వరుడు బేతేశ్వరుడుగా, పిల్లల మర్రిలో ఎఱకసానమ్మ ప్రతిష్టించిన దేవుడు ఎఱకేశ్వరుడుగా, రేచర్ల రుద్రసేనాని కట్టించిన ఆలయం రుద్రేశ్వరాలయంగా (తర్వాతి కాలంలో రామప్ప గుడి), చౌండసేనాని కట్టించినది చౌండేశ్వరాలయంగా (కొండపర్తి శివాలయం) పిలవబడ్డాయి.

అదే పద్ధతిలో కాకతీయ గణపతిదేవుని ప్రతిష్టగా భావిస్తున్న ఈ ఆలయాన్ని గణపేశ్వరాలయంగా పిలుస్తున్నారు. ఇదేలా ఆలయ నిర్మాణాన్ని ఇదే పేరునీ కలిగిన ఆలయం వరంగల్ జిల్లా గణపురంలో వుంది. గణపతిదేవ చక్రవర్తి పేరున క్రీ.శ. 1234లో జయ సంవత్సర వైశాఖ శుద్ధ త్రయోదశి బృహస్పతి వారం రోజున గణపురం(గణపవరం), గణపేశ్వరాలయం(కోటగుళ్లు), గణపసముద్రం(చెరువు) నిర్మితమయ్యాయి. రామప్ప దేవాలయాన్ని నిర్మించిన కాకతీయ సర్వ సైన్యాధ్యక్షుడు రేచర్ల రుద్రారెడ్డి మూడో కుమారుడు గణపురం సామంతుడు గణపతి రెడ్డి ఆధ్వర్యంలో ఈ నిర్మాణాలు జరిగాయట.

కాకతీయ సామ్రాజ్య పతనానంతరం 150 సంవత్సరాల తర్వాత రాసిన ఏకామ్రనాథుని ప్రతాపరుద్ర చరిత్రలో అధిక సంఖ్యలో దేవాలయాల ప్రస్తావనలు కనిపిస్తాయి. నేడు అవి కేవలం పదుల సంఖ్యంలోనే మిగిలాయి. అటువంటి దేవాలయాలలో పెద్దగా చెక్కు చెదరకుండా స్థిరంగా మిగిలిన దేవాలయం కూసుమంచి గణపేశ్వరాలయం.

కాకతీయ రాజు గణపతిదేవుని కాలంలో తన విజయాలకు కారణమైన శివుడికి కృతజ్ఞతాపూర్వకంగా వేయిగుళ్లు కట్టిస్తానని చేసుకున్న మొక్కులో భాగంగానే నేటి తెలంగాణా ప్రాంతంలో అనేక కాకతీయుల నాటి శివాలయాలు కనిపిస్తుంటాయి. నిజానికి భక్తిరూపంగానే కాక ప్రజలను ఏకతాటిపై వుంచేందుకు కూడా ఆధ్యాత్మికత తోడ్పడింది. బహుశా తమ వంశ చరిత్ర తరతరాలు నిలచిపోయేందుకు కాకతీయులు ఆలయాల ద్వారా ఒక మార్గాన్ని ఏర్పరచుకుని వుండొచ్చు.

అనమకొండలోని వేయిస్తంభాల గుడిని కాకతిరుద్రుడు క్రీ.శ 1162లో నిర్మించివుంటాడని దేవాలయ ప్రాంగణంలోని నల్లరాతి స్తంభంపై రుద్రదేవుని క్రీ.శ 1163 నాటి శాసనం ఆధారంగా తెలుస్తోంది. పాలంపేటలోని రేచర్ల రుద్రుని రామప్ప దేవాలయం ఆలయ ప్రాంగణంలోని పటిష్టమైన శాసనం ఆధారంగా అది క్రీ.శ 1215లో నిర్మించి వుండవచ్చని భావిస్తున్నారు. కానీ గణపతిదేవుని కాలం క్రీ.శ 1199 నుంచి క్రీ.శ 1262

లలో నిర్మించబడివుండవచ్చుని చెపుతున్న కూసుమంచి గణపేశ్వరాలయం యొక్క ఖచ్చితమైన తేదీలు నిర్మించినవారి వివరాల ఆధారాలకోసం పరిశోధించాల్సివుంది.

కూసుమంచి గణపేశ్వరాలయం నిర్మాణపరంగా పాలంపేట రామప్ప దేవాలయాన్ని, వరంగల్ లోని వేయిస్తంభాల గుడిని గణపురంలోని కోటగుళ్లు లేదా గణపేశ్వరాలయాన్ని పోలి వుంది. ఈ ఆలయ నిర్మాణానికి ఆనాడు కూలీలు, పనివారు వరంగల్ ప్రాంతం నుంచి వచ్చారట. గణపతి దేవునికి **నానావర్ణ వరమండలీకరగండ** బిరుదున్నట్లు ప్రతాప చరిత్రము (పుట 34), కాసె సర్వప్ప రచించిన సిద్ధేశ్వర చరిత్ర (పుట 127) లలో ప్రస్తావనలున్నాయి. గణపతిదేవునికి రాజ్యనిర్వహణలోనూ, పరిపాలన సంబంధమైన విషయాలలోనూ సహాయకులుగా అన్ని కులాలకు సంబంధించిన వారినీ నియమింపజేసుకున్నాడనేది దీనివల్ల తెలియవస్తోంది. అందుకే ఈ దేవాలయ నిర్మాణం కేవలం వర్ణ ప్రాతిపదికమీద కాకుండా నైపుణ్యం, కౌశల్యం ప్రాతిపదికన చేయించి వుంటారని భావించవచ్చు.

## కాకతీయ నిర్మాణం అనేందుకు కొన్ని సూటి ఆధారాలు

కాకతీయ దేవాలయాలలో కనిపించే కొన్ని ప్రత్యేక లక్షణాలు ఈ దేవాలయం కాకతీయులకాలం నాటిదే అయివుండవచ్చని చెప్పేందుకు ఆకరాలుగా కనిపిస్తున్నాయి.

1) ముక్కంటేశ్వరాలయంలోనూ, వేణుగోపాలస్వామి ఆలయంలోనూ విశిష్ట రీతిలో చెక్కిన స్తంభాలు.

2) ముందుకు పొడుచుకు వచ్చినట్లుండే క్రింది గుమ్మాలూ, పై గుమ్మాలూ

3) గర్భాలయ ముఖద్వారం పైన లలాట బింబంగా గజలక్ష్మి రూపం

4) గర్భాలయంలో అర్చామూర్తికి పైన వున్న చక్రము లేదా రాతిపద్మం. దానిచుట్టూ ఒక పద్ధతిలో చెక్కిన పద్మదళాలు.

5) అంతరాళము

6) పై కప్పుకు చెక్కిన పద్మదళాలు

7) రంగమండపము

8) ద్వారపాలకులు

9) వేయిస్తంభాల గుడిలో ప్రధాన లింగాన్ని అచ్చంగా పోలిన శివలింగము

10) రామప్పదేవాలయపు నిర్మాణాన్ని పోలిన గుడి నిర్మాణము

11) శివ–విష్ణు రూపాలను ఒకే చోట ప్రతిష్ఠించిన విధానం

12) త్రికూటాలయ పద్ధతిలో నిర్మించిన ముక్కంటేశ్వరాలయం

13). శాసనంపై వున్న సూర్యచంద్రులు మరికొన్ని శాసన శిల్పాలు

14) టిటిటి పద్ధతిలో నిర్మించిన గంగాదేవి చెరువు ఉనికి.

# కాకతీయుల సంక్షిప్త చరిత్ర

**తెలుగు** ప్రాంతం అంతటినీ ఒక్కటి చేసి శాతవాహనులు పరిపాలించిన వెయ్యేళ్ల తరువాత తిరిగి తెలుగువారందరినీ ఒకే ఏలుబడిలోకి తీసుకువచ్చిన వారు కాకతీయులు. దాదాపు రెండు శతాబ్దాల పాటు తెలుగుదేశాన్ని పరిపాలించి రాజకీయంగానూ, సాంఘికంగానూ తెలుగుజాతికి విశ్వవ్యాప్తమైన కీర్తి ప్రతిష్ఠలు కల్పించిన వారు కాకతీయులు. దక్షిణాన కంచి నుంచి తూర్పున దక్షిణ కళింగ వరకు, కోస్తా, తెలంగాణా ప్రాంతాలతో పాటు, ఆథోని, రాయచూరు, బీదరు కోటల దాకా కాకతీయ సామ్రాజ్యం విస్తరిల్లింది.

కాకతీయ రాజుల పరిపాలనా కాలాన్నిపరిశీలించి చూస్తే కాకతీయ సామ్రాజ్యపు మొట్టమొదటి బేతరాజు క్రీ.శ. 992 నుండి 1052 వరకు పాలించాడు. మొదటి బేతరాజు ఖమ్మం జిల్లా మధిర తాలూకా ప్రాంతాన్ని, తర్వాత వరంగల్ జిల్లా మానుకోట ప్రాంతాన్ని పాలించాడు. ఖమ్మంజిల్లా సత్తుపల్లి మండలంలో ఈ బేతరాజు పేరుతో **బేతుపల్లి** గ్రామం వుంది. అక్కడ కాకతీయుల నాటి శివాలయం ఉన్నది. అలాగే బేతుపల్లికి దగ్గరలో



కాకర్లపల్లి గ్రామముంది. ఇక్కడ కూడా ఆ కాలం నాటి శివాలయం ఉన్నది. ఇటీవలి కాలంలో ఈ దేవాలయాలను పునర్నిర్మించారు. వరంగల్ జిల్లా మొగిలిచెర్ల పక్కనే, అంటే వరంగల్ కోటకు పది మైళ్లలోపే బేతవోలు అనే గ్రామం వుంది. ఇప్పుడు దానిని **బేతోలు** అంటున్నారు.

బేతరాజు మరణించిన తర్వాత మొదటి ప్రోలరాజు సింహాసనమధిష్టించాడు. ఇతని పాలనాకాలం 1052 నుండి 1072 వరకు నడిచింది.

మొదటి ప్రోలరాజు పాలనానంతరం రెండవ బేతరాజు 1079నుండి 1108 వరకు పాలించాడు. కాజీపేట శాసనంలో ఇతన్ని గొప్ప వీరుడిగా వర్ణించబడివుంది.

ఇతడి పాలనానంతరం ఇతని పెద్ద కుమారుడు దుర్గరాజు 1108 నుండి 1116 వరకు పాలించాడు.

తదుపరి రెండవ ప్రోలరాజు పరిపాలన కొచ్చాడు. ఇతడు 1116 నుండి 1157 వరకు 41 సంవత్సరములు పరిపాలించాడు. ఇతని కాలంలో కాకతీయ రాజ్యము పూర్తిగా బలపడి సర్వ స్వతంత్రమయ్యింది.

తర్వాత రుద్రమదేవుడు 1158 నుండి 1195 వరకు రాజ్య పరిపాలన చేసాడు అనేక యుద్ధాల ద్వారా తన రాజ్యాన్ని విస్తరించాడు కూడా. వేయి స్తంభాల దేవాలయ సముదాయాన్ని క్రీ.శ. 1163లో కాకతీయ రాజు ఒకటవ రుద్రదేవుడు నిర్మించాడని చెప్పే శాసనం ఉంది.

రుద్రమదేవుడి మరణానంతరం మహాదేవ రాజు 1196 నుండి 1198 వరకు కేవలం రెండు సంవత్సరములు పాలన చేసాడు. మహాదేవరాజు రుద్రమదేవుడి సోదరుడే. ఇతని మరణానంతరం కాకతీయ ప్రభువులలో అగ్రగణ్యుడైన గణపతిదేవుడు రాజయ్యాడు.

గణపతిదేవుడు 1199 నుండి 1226 వరకు సుదీర్ఘకాలం పరిపాలన చేసాడు. ఇతని కాలంలో కాకతీయ సామ్రాజ్యం చాలా వరకు విస్తరించింది. కూసుమంచి గణపేశ్వరాలయానికి గణపతిదేవుని వలన ఆ పేరు వచ్చింది అని పైభాగాలలో చెప్పుకున్నాం. గణపతిదేవునికి ఆ పేరురావడానికి కారణాన్ని చెప్పే కథను ప్రతాపరుద్ర చరిత్ర(పేజి 28) సిద్ధేశ్వర చరిత్ర (పేజీ 109) లలో చూడవచ్చు. మహదేవరాజుకు చాలా కాలం సంతానం లేకపోవడంతో శ్రీశైల మల్లికార్జున స్వామిని సేవించి వంశాంకురంకోసం ప్రార్థిస్తూ, అక్కడ వున్న 10వేల మంది మఠాధిపతులను సేవిస్తూ కొంత కాలం గడిపాడు. ఆ విధంగా గణారాధన ఫలితంగా జన్మించిన వాడు కాబట్టి గణపతి అనే పేరు పెట్టారట. గణపతిదేవుని ఓరుగల్లు శాసనంలోని బిరుదుగద్యలో కనిపించే **ప్రత్యక్ష ప్రమథగణావతార** (కాకతీయ వైభవం పుట 10) అందుకు మంచి నిదర్శనం.

గణపతిదేవుని దీక్షాగురువు శ్రీ విశ్వేశ్వర శంభువని మల్కాపుర శాసనం ద్వారా తెలుస్తోంది. గణపతిదేవుని గురువైన మల్లికార్జునారాధ్యుడు, మల్లికార్జున పండితారాధ్యుని మనవడు.

గణపతిదేవుని అనంతరం ఇతని కుమార్తె రుద్రాంబ పరిపాలించింది. గణపతి దేవునికి కుమారులు లేనందున ఆమె రాజ్ఞి అయ్యింది. ఈమె పాలనా కాలంలో ఓరుగల్లుకోట శత్రుదుర్భేధ్యంగా, దృఢంగా తయారయ్యింది. ఈమె అనంతరం ప్రతాపరుద్రుడు రాజయ్యాడు. ఇతడు రుద్రాంబకు దౌహిత్రుడు. (సిద్ధేశ్వర చరిత్ర కథనం ప్రకారం రుద్రమదేవి మొదటి కుమార్తె ముమ్మడమ్మ కొడుకు ప్రతాపరుద్రుడు. కొడుకులు లేనందు వల్ల మనుమడే తనకు అపర కర్మలు చేయాలని తనకి వారసుడుగా రాజ్యపాలన చేయాలని రుద్రమాంబ నిర్ణయంతీసుకుంది. మనవడికి 5 ఏళ్ళ వయసునుంచే తన ఒడిలో కూర్చోబెట్టుకుని రాజ్యపాలన చేసేదట) రుద్రాంబ ఇతనిని కుమారునిగా స్వీకరించింది. ఇతడు మంచి విజ్ఞానవంతుడు, కవిపండిత పోషకుడు. క్రీ.శ. 1302 నుంచి క్రీ.శ 1323 మధ్య ఓరుగల్లుపై ఢిల్లీ సుల్తానుల సైన్యం ఏడుసార్లు దండయాత్ర చేసింది. గెలవటం కంటే ప్రధానంగా దోచుకు పోయేందుకు వారీ దండయాత్రలను చేసారు. అనేక సార్లు కాకతీయ సైన్యం వారి ప్రయత్నాలను తిప్పికొట్టింది.

1323వ సంవత్సరంలో ఢిల్లి రాకుమారుడు ఉల్గూఖాన్ (ఇతనే రాజయ్యాక “మహమ్మద్ బిన్ తుగ్లక్” ) తన అపార సైన్యాన్ని ఓరుగల్లుకు పంపించాడు. ప్రతాపరుద్రుడు ఐదు నెలల కాలం యుద్ధం చేసి చివరకు వారికి బంధీగా పట్టు బడ్డాడు. ప్రతాపరుద్రుడిని ఢిల్లీకి పంపించారు. కానీ మార్గం మధ్యలోనే ప్రతాపరుద్రుడు మరణించాడు. దీనితో మహోజ్వలంగా వెలిగిన కాకతీయ సామ్రాజ్యం అంతరించింది.

## కాకతీయుల మత విశ్వాసాలు

రాష్ట్రకూటుల పాలనలో జైన అధికారికంగా పోషింపబడుతున్న కాలంలో కాకతీయులు అధికారాలను హస్తగతం చేసుకున్నారు. కాకతీయులు మొదట జైన మతాన్ని అనుసరించేవారు. నాటి జైనుల ప్రాభవానికి వరంగల్లు సరిహద్దుల్లోని కొలనుపాక జైన దేవాలయం దర్పణం పడుతుంది. అనమకొండ గుట్టమీది పద్మాక్షీదేవి బహుశా మొదట్లో జైనదేవతే అయివుంటుంది.

కాలముఖ, కాపాలిక, పాశుపత, ఆరాధ్యశైవ, వీరశైవాది శైవ అంతర్గత భేదాలలో పాశుపతశైవం కాకతీయుల కాలంలో ప్రముఖంగా వుండేది. కాకతీయ ధ్వజంపై విష్ణుమూర్తి అవతారాలలో ఒకటైన వరాహ మూర్తి చిహ్నం ఉన్నప్పటికీ, వీరు మాత్రం శైవాన్ని పెంచి పోషించారు. కాకతీయులు శైవాన్ని పోషించడం ప్రారంభించిన తరువాత అనేక జైన

మంటపాలను కళ్యాణ మంటపాలుగా, శైవ మందిరాలుగా మార్చివుంటారు. వేయి స్తంభాల దేవాలయంలో ప్రస్తుతం పునర్నిర్మాణం జరుగుతున్న కళ్యాణ మంటపం కూడా ఇలాంటి జైన మంటపమేనని పలువురు చారిత్రక విశ్లేషకులు అభిప్రాయ పడుతున్నారు. సాధారణంగా జైన మంటప స్తంభాలపై పూర్ణకుంభాలు కనిపిస్తాయి. ఇతర ఆలయ స్తంభాలపై వీటి జాడ ఉండదు. వేయి స్తంభాల గుడిలోని కళ్యాణమంటపంపై కూడా పూర్ణ కుంభాలు కనిపించడం గమనార్హం

## దక్షిణం వైపు మెట్లపై పాదముద్రలు



గణపేశ్వరాలయ రంగమంటపానికి దక్షిణం వైపు వున్న రాతి మెట్లమార్గంపై మామూలు పరిమాణం కంటే పెద్దగా వున్న పాదముద్రల జాడలు కనిపిస్తాయి. ఇవి సహజంగా వాతావరణ పరిస్థితుల వల్ల ఏర్పడినవో లేదా కావాలని చెక్కారో తెలియదు. ఇప్పుడు వీటిని శివుడి అడుగుజాడలని చెప్పుకుంటున్నారు. ఇలా పాదముద్రలను పూజించే సాంప్రదాయం బౌద్ధంలో గమనిస్తాం. ఒకవేళ కొంతకాలం బౌద్ధసన్యాసులు ఈ మంటపాన్ని ఆవాసంగా చేసుకుని వుండి వుంటారా? అనే సందేహం ఈ ముద్రల వల్ల కలుగుతుంది.

# గణపేశ్వరాలయం అమరిక


గణపేశ్వరాలయం పునాది చిత్రం

దేవాలయాల గురించి తెలుసుకునేందుకు చాలా చోట్ల శాసనాలు, సాహిత్యం ఉపయోగపడ్డాయి. అదేవిధంగా దేవాలయ నిర్మాణాన్ని ఒక క్రమంలో అర్థం చేసుకోవడం ద్వారా కూడా ఆలయం గురించి చాలా విషయాలు తెలుసుకోవచ్చు. అదృష్ట వశాత్తూ గణపేశ్వరాలయం పునాదులనుంచి మూలవిరాట్లు వరకూ చెక్కుచెదరకుండా నిలచివున్నాయి. వాటిని ఒక్కొక్కటిగా పరిశీలిస్తూ నిర్మాణ సంగతులను అర్థం చేసుకోవచ్చు.

## పీఠం, ఉపపీఠం

దేవాలయం మొత్తం దేనిమీద నిలబడి వుంటుందో దాన్ని పీఠం లేదా అధిష్ఠానం అంటారు. ఇది దేవాలయానికి పాదం లాంటిది. కాకతీయుల కాలంలో కట్టించిన పెద్దపెద్ద దేవాలయాలన్నింటిని భూమికి 5 లేదా 6 అడుగుల ఎత్తుగా వున్న అత్యంత విశాలమైన రాతి పీఠాలపై నిర్మించారు. పాలంపేట రామప్పదేవాలయం, హనుమకొండ రుద్రేశ్వరాలయం, పిల్లలమర్రి ఎరుకేశ్వరాలయం లాగానే కూసుమంచి గణపేశ్వరాలయాన్ని కూడా నేలనుంచి 6 అడుగులు పై బడిన ఎత్తులో పీఠాన్ని తయారుచేసి దానిపై ఆలయాన్ని నిర్మించారు. పునాదులకోసం డబ్బాలాగా దీర్ఘఘనాకారంలో తీసిన కందకంలో ఇసుకను నింపి, కుదించి, దానిపై బండలను ఒకదానిపై ఒకటి ఒక క్రమంలో పేర్చారు. ఈ రకంగా ఇసుక పునాదులు వాడటాన్ని **శాండ్‌బాక్స్ టెక్నాలజీ** అంటున్నాము. భూమి పొరల్లో సర్దుబాట్ల వాళ్ళ భూకంపాలూ, తుఫానులూ వంటివి వచ్చినప్పటికీ మొత్తంగా పీఠం పగుళ్లిచ్చి కూలిపోకుండా ఇసుకలో సర్దుబాట్లు జరగటం ద్వారా ఆలయం నిలబడే వుండేందుకు ఈ విధానం తోడ్పడుతుంది అని కొందరు నిపుణులు అంటున్నారు. రైలుపట్టాల విషయంలోనూ, హైవే విద్యుత్ తీగలు వదులుగా కట్టడంలోనూ ఉష్ణవ్యాకోచాలను దృష్టిలో వుంచుకున్నట్లు కాలక్రమంలో సంభవించే ఉష్ణోగ్రతా

వృత్యాసాలు, భూకంపాలు వంటివాటిని తట్టుకుని తరాల పాటు నిలబడటానికి శ్యాండ్ బాక్స్ విధానం సమర్ధవంతంగా ఉపయోగపడుతుంది అని కొందరంటుంటే, మరికొందరు ఈ శాండ్‌బాక్స్ విధానం వల్లనే కాకతీయ ఆలయాలు ఎక్కువగా బలహీనపడ్డాయని వాదిస్తున్నారు.

ఈ అధిష్ఠానం కింద ఉండే వరుసల్ని ఉపపీఠం అంటారు. గణపేశ్వరాలయ ఉపపీఠం చూడటానికి ఎత్తుగా, చుట్టూ ప్రదక్షిణ చేయటానికి విశాలంగా ఉంది. ఆధారశిల, ఉపానం, పద్మం, పట్టిక, కుముదం, అథోపద్మం అనే ఉపపీఠం వరుసలపై ఎలాంటి అలంకార శిల్పమూ లేక సాదాగా వున్నాయి.


సింహధార, గజధార

అధిష్ఠానానికి పైన ఏనుగుల వరుస **(గజధార)**లు, కమలాల వరుస (పద్మధార) లు బహుశా చుట్టూ వుండేవి కావచ్చు. కాలక్రమంలో శిథిలమైనవి శిథిలమైపోగా మిగిలిన కొన్ని వరుసలూ ఇప్పటికీ అక్కడక్కడా కనిపిస్తున్నాయి. పైవైపున సమంగా గర్భాలయ, అర్ధమండప, రంగమండపాల నేలరాళ్ళు పరచబడినాయి.

## కక్షాసనాలు, పాదవర్గం



దేవాలయ రంగమండప అధిష్ఠానంపై గల రాళ్ళపై నిలువుగా ఒక పిట్టగోడ లాంటి రాయి వుంది. దీన్ని కక్ష్యాసనం (ఆనుకుని కూర్చోటానికి ఉపయోగపడేది) అంటారు. మండపం లోపల వున్న వరుసల వేదికలు, దానిపై భక్తులు కూర్చోవటానికి అరుగుగా ఉపయోగపడుతుంది. అధిష్ఠానంపైన ఉండే దేవాలయ గోడభాగాన్ని పాదవర్గం అంటారు.

## ప్రదక్షణా పథం

గర్భాలయం చుట్టూ తిరిగేందుకు ఏర్పాటు చేసిన దారి ఇది. మొత్తం గుడి చుట్టూ తిరిగేందుకు ఒక బాహ్యప్రదక్షణా పథం వుంది. పైన గర్భాలయం చుట్టూ తిరిగేందుకు మరొక ప్రదక్షణా పథం కూడా వుంది. దేవకోష్టాలను, దేవాలయం పై చెక్కిన శిల్పాలనూ, సింహ,గజ, పద్మధారలను గమనించుకుంటూ దేవాలయ ప్రదక్షణ చేసే అవకాశం వుందిక్కడ.



## దేవకోష్టాలు

గర్భాలయ గోడల ముఖశాల మధ్యలో మూడువైపులా మూడు కోష్ఠాలున్నాయి. ఉత్తర,పశ్చిమ,దక్షిణ దిశలలో దేవతల విగ్రహాలనుంచే గూడుల వంటి నిర్మాణాలు ప్రతివైపూ మూడు దొంతరలలో వున్నాయి. క్రింది దానికి కంటే మధ్యలోది, దానికంటే పైదాని అంతరాళాలు చిన్నవిగా వుంటాయి. ప్రతికోష్టానికీ చక్కటి రాతి చూరు వుంది. వాటికున్న చక్కటి అలంకరణను ఆకర్షణీయంగా వున్నాయి.

## ద్వారశాఖలు మరియు ప్రస్తరం (చూరుగల కప్పు)

గర్భాలయం, అర్థమండపం, రంగమండపం గోడలపై వర్షం నీరు పడకుండా బాగా వెడల్పుగా పైన ప్రస్తర కపోతముంది. దాన్ని చూరు లేదా లింటెల్ అనవచ్చు.

ద్వారశాఖలు సైతం రాతి కట్టడాలే. సాధారణంగా శివాలయాలలో చిన్న ద్వారాలను వుంచటం ద్వారా ఎంతటి వారయినా తలవంచుకునే వెళ్ళాలనే సందేశాన్ని ఇస్తారు అని కొన్ని చిన్నద్వారాల గురించి ఇచ్చిన వివరణల్లో చెపుతారు. కానీ గణపేశ్వరాలయం ద్వారం



మాత్రం చాలా పెద్దదిగా వుంటుంది. సూర్యోదయం సమయంలో సూర్యకిరణాలు సరాసరి లోపటి శివలింగాన్ని ఏ అడ్డంకీ లేకుండా స్పర్శించేందుకు పెద్దవైన ద్వారశాఖలు ఉపయోగపడుతున్నాయి. ప్రధానంగా ఇంత పెద్ద శివలింగాన్ని భక్తులు కళ్లారా చూడాలంటే ద్వారం ఖచ్చితంగా పెద్దదిగా వుండాలి.

వర్షం కురిసినపుడు జల్లు ఎక్కువగా లోపటికి పడితే లోపటంతా నీటిమడుగు అయ్యే అవకాశం వుంది. అందుకోసం ఈ ప్రవేశమార్గం పైన చక్కటి వంపుతిరిగిన చూరు(లింటెల్) నిర్మించారు. ఇది పరిమాణ రీత్యా చాలా పెద్దగా వుండటమే కాక ద్వారశాఖలలాగానే ఇది కూడ రాతి నుంచి మలచబడినదే. అదికూడా దేవాలయ నిర్మాణపు లెగోబ్రిక్ పద్ధతిలోనే చాలా చక్కగా దర్వాజా పైన అమర్చారు. ఈ చూరు పైవైపు అండాకారంగానూ క్రిందివైపు పుటాకారంగానూ వుంది. ఎండావానలను కాచే గొడుగులాగానే కాక అబ్బురమనిపించే అలంకరణతో ఎలివేషన్‌లాగా కూడా ఇది ఉపయోగపడింది. ద్వారశాఖలపై చెక్కిన శిల్పాలు రామప్ప ద్వారశాఖలపైనున్న శిల్పరీతినే పోలి వున్నప్పటికీ అంత నిపుణత చూపలేదు. ద్వారశాఖకూ రాతి స్థంభానికీ మధ్యనున్న యుద్ధ మదనిక శిల్పాలను పోలిన ద్వారపాలికలు మాత్రం ప్రత్యేకంగా వున్నాయి. ద్వారానికి రెండు వైపులా వాతాయనాలు అనగా కిటికీలున్నాయి. అవికూడా రాతితో నిర్మించినవే కావడం ప్రత్యేకత.

## గర్భగృహ ద్వారశాఖలు




గర్భగృహ ద్వారశాఖలు కూడా శిలాకుడ్య స్తంభాలతోనే నిర్మించబడ్డాయి. ప్రధాన ద్వారం నుంచి లోపలికి వచ్చిన తర్వాత అర్చామూర్తికీ ముందున్న చివరి విభజనరేఖ ఇది మాత్రమే. నిర్మాణాన్ని పరిశీలిస్తే ఇది కేవలం ద్వారంగానే కాకుండా ఆలయభారాన్ని మోసేందుకు కూడా ఉపయోగపడేలా నిర్మించారని అర్థం అవుతుంది. అందుకే మందమైన పెద్ద పట్టెడలు రెండువైపులా ధృఢంగా వుండేలా నిలబెట్టి వుంటారు. ద్వారపాలక విగ్రహాలను, పౌరాణిక ఘట్టాలను వివరించే చిత్రాలనూ ఈ నిలువు పట్టెడలపై కుడ్యచిత్రాలుగా చెక్కి

వున్నాయి. క్రింది భాగంలో వెడల్పయిన పెద్ద రాతి గడపను వుంచారు. ద్వారబంధానికి పైన వున్న అడ్డురాతిదూలం మధ్య భాగంలో గజలక్ష్మీ దేవిని లలాటబింబంగా చిత్రించారు.

## లలాట బింబం



నుదుటన బొట్టు పెట్టుకున్న విధంగా ద్వారబంధం పైన మధ్య భాగంలో చెక్కే శిల్పాలను లలాట బింబం అంటారు. వీటిలో ప్రధానంగా గజలక్ష్మి విగ్రహం లేదా ఒకే పద్దతిలో మలచిన మహాగణపతి విగ్రహాన్నో చెక్కేవారు. ఈ ఆలయంలో లలాట బింబంగా గజలక్ష్మి విగ్రహం కనిపిస్తుంది.

## గర్భాలయం

ఆలయంలోని ప్రధాన భాగమైన ఈ గర్భాలయానికి రెండు వరుసల్లో గోడలున్నాయి. బయటిగోడను బాహ్యభిత్తి అని, లోపలి గోడను అంతరభిత్తి అని అంటారు. వీటి మధ్య ఖాళీప్రదేశం కూడా వదిలారు. ఈ ఖాళీ ఉష్ణనియంత్రకంగా పనిచేయడంతో బయటి ఉష్ణోగ్రతల ప్రభావం లోపటిగదిలో ఎక్కువగా పడదు. ఈ రెండు గోడల మధ్య ఖాళీ ప్రదేశాలనుంచి రహస్య ప్రవేశమార్గాలున్నాయి. సబ్‌వే లో ప్రవేశించిన తర్వాత వేర్వేరు దిశలకు మళ్ళీ అవి దారితీసినట్లు గోడల మధ్యనుంచి లోపటికి వెళ్ళిన దారి మళ్ళీ వేర్వేరు దిశలుగా చీలుతుంది వీటిద్వారా వేర్వేరు చోట్లకు వెళ్ళేలా నిర్మించుకోవడంతో అత్యవసర సమయాలలో దేవాలయం ఆనుపానులు తెలిసిన వారికివి రక్షణను కల్పించేవి కావచ్చు. అంతేకాకుండా భూగర్భంలో వున్న శివలింగం సాత్త్విక భాగాన్ని కేవలం అంతఃపుర వాసం మాత్రమే సందర్శించుకునే ఏర్పాటు వుండి వుంటుందని. బయటి ప్రదక్షిణా పథం లాగా లోపట కూడా మరో ప్రదక్షిణా పథం వుండొచ్చనేది ఒక ఊహ. లోపలి గోడ తర్వాత 15 అడుగుల పొడవు ఐదడుగుల వెడల్పు గల రాతిదిమ్మెలను పేర్చి గర్భాలయ ముఖమంటపం నిర్మించారు. గర్భాలయంలోని శివలింగం 12 అడుగుల ఎత్తు, 6.3 అడుగుల కైవారంతో ఏకశిలా రూపంగా నిర్మించారు. దీనికింద మూడు అడుగుల విస్తీర్ణంతో పానవట్టం నిర్మించారు.

## ప్రస్తరము లేదా పై కప్పు

గర్భగృహాన్ని లేదా అంతరాళాన్ని మూసివేస్తూ పై కప్పువుంది. ఇది కూడా రాతి పలకలను జాగ్రత్తగా ఒకదానిపై ఒకటి ఆధారపడేలా పేర్చుకుంటూ నిర్మించినదే. రీయిన్

ఫోర్సుడ్ కాంక్రీటుకంటే ధృఢంగా ఎక్కువకాలం నిలిచేలా వీటిని పేర్చగలగటం గొప్పదనమే.



## శిలాపద్మం

గర్భాలయం పై కప్పుమీద ఒక చక్రాన్ని చిత్రించడం కాకతీయుల నిర్మాణ ప్రత్యేకత. దేవాలయం పెద్దదయినా చిన్నదయినా గర్భాలయంలోని ఈశ్వరునికిపై భాగంలో అష్టకోణాలతో ఈ చక్రం కనిపిస్తుంది. గణపేశ్వరాలయపు గర్భాలయంలో అర్చామూర్తికి పైభాగంలో ఆలయపు పైకప్పుకు సౌష్టవాకారంలోని రాతి పద్మాలు వున్నాయి. దానిచుట్టూ ఒక క్రమపద్ధతిలో చెక్కిన పద్మదళాలు కూడా వున్నాయి. ముక్కంటేశ్వర, వేణుగోపాల అంతరాలయ మంటపాలలోనూ, రంగమంటపంలో కూడా అందమైన పద్మనిర్మాణాలను గమనించవచ్చు.

## శిఖరం (విమానం)

కప్పు తర్వాత వుండే శిఖర నిర్మాణాన్ని విమానము అంటారు. అనేక రకాల కొలతలతో నిర్మించటం వల్ల దీన్ని విమానం (**నానా మానవిధానత్వాత్ విమానం పరికల్పయేత్**) అన్నారు. గణపేశ్వరాలయం **ఏకత విమానాలయం**. పాలంపేట, గణపురం ప్రధానాలయం, పానగల్లు, కొండపర్తి, నిడికొండ, పిల్లలమర్రి, నాగులపాడు, బయ్యారం ఆలయాలుకూడా ఇదేవిధమైన ఏకత విమానాలయాలే. రామప్ప ఆలయ విమాన శిఖరం తేలికైన ఇటుకలతో మూడంతస్తులుగా కట్టారు. కానీ గణపేశ్వరాలయంలో విమానం శిఖరంలాగా ఎత్తుగా కాకుండా కూటకోట లక్షణంతో ద్రావిడ పద్ధతిలో చదరంగా నిర్మించారు. ఆకారాన్ని బట్టి శిఖరాలకు వేరువేరు పేర్లుపెట్టారు కానీ విమానం ఏ ఆకారంలో వున్నా అంటే చదరంగా, గుండ్రంగా, షట్ – అష్ట భుజాలలా వున్నప్పటికీ దానిని కూటశిఖరం అని అన్నారు. దానిపైన నిధి కలశం వుంటుంది. బహుశా మొత్తం గుడిని ఒక శివలింగాకారంలో భావించి కట్టడం వల్లనే ఇలా విమాన నిర్మాణంలో ప్రత్యేకత పాటించివుంటారేమో. అయితే నిర్మాణం ఇంకా పూర్తికాకముందే ఆపాల్సి రావడం వల్ల కూడా అలా జరిగివుండవచ్చు. కప్పువరకూ కట్టడం పూర్తయిన తర్వాత శత్రుదాడులు లేదా మరేదైనా అవాంతరాలతో నిర్మాణం ఆగిపోవటంవల్ల ఇలా జరిగే అవకాశం వుంది.

## రంగమండపం

గణపేశ్వరాలయంలో గర్భగుడికి ఎదురుగా అత్యంత విశాలమైన రంగమండపం

వుంది. దీనికి ఎటువంటి కప్పులేకపోవడంతో ఓపెన్ ఎయిర్ ఆడిటోరియంలాగా వుంటుంది. రంగమంటపం మీదకు తూర్పు, ఉత్తర, దక్షిణ మూడు దిశలనుంచి మెట్లమార్గం వుంది. 12 అడుగుల వ్యాసంతో గుండ్రని శిలతో మలచిన రంగశీర్షం మధ్యంలో వుంటుంది. రంగమండపం అర్థం, దాని ఉపయోగాలు, రకాలు, కాకతీయుల కాలంనాటి రచనలలో రంగమంటపం ప్రస్తావనల గురించి కొంచెం చూద్దాం.

దేవాలయ గర్భగృహం తరువాత తూర్పువైపున వున్న విశాలమైన స్థలాన్ని రంగమండపం అంటారు. దీనికి మూడువైపులా దారులున్నాయి. దేవుని విగ్రహానికి చేసే అలంకరణలను అంగభోగమని, రంగశిలనుంచి అర్పించే నాట్యాన్ని రంగభోగమనీ, రెండింటినీ కలిపి అంగరంగ భోగాలనీ అంటారు. గణపేశ్వరాలయంలోని రంగమంటపానికి స్తంభాలు కానీ కప్పుకానీ నిర్మించబడిలేవు. పైగా ఇంతకు ముందు స్తంభాలుండి ఇప్పుడు కూలివుంటాయన్నట్లు గుర్తులు కూడా లేవు. కావాలనే దీనిని ఓపెన్ డయాస్ లాగా నిర్మించివుంటారు. కూసుమంచి గణపేశ్వరాలయం రంగమండపం మధ్య పన్నెండు అడుగుల వ్యాసం కలిగిన వృత్తాకార శిలా ఫలకంవుంది. పూర్వం ఆలయాలలో చేసే సాంప్రదాయ నృత్యాలకు వీటిని వేదికలుగా వాడేవారు. దేవాలయాలలో జరిపే చతుషష్టి ఉపచారాలలో నృత్యం ఒకటి. అది దేవాలయ రంగమండపంలో జరిగేది.

**నృత్తరత్నావళిలో పేర్కొన్న రంగమండపము రకాలు**

**జేష్ఠము:** ఇది 108 మూరలు వుంటుంది. కేవలం రాజుల కొరకు మాత్రమే నిర్మించబడే రంగమంటపము ఇది. దీనిలో పాటలు, వాయిద్యములూ వినపడవు. నర్తకులు కూడా కనిపించరు. అందుకే ప్రశస్తము కాదు అని పేర్కొన్నారు.

**మధ్యమము:** ఇది 64 మూరలు, రాజవంశీయులకు అనుకూలమూ మరియు ప్రశస్తమూ అని పేర్కొన్నారు.

**కనిష్టము:** ఇది 32 మూరలు వుంటుంది. దీనిలో ఇతరులకు ధ్వని పెద్దదై మాధుర్యము నశిస్తుందని అందువలన అప్రశస్తము అని పేర్కొన్నారు.



# ఆలయ ప్రత్యేకతలు

కళలన్నింటికీ నిర్మాణ శాస్త్రం తల్లిలాంటిది ( Architecture is mother of all arts) అంటారు. మరీ ముఖ్యంగా దేవాలయ నిర్మాణాలలో జీవితంలోని అనేక కోణాలను రూపించారు. మానవుడు ప్రప్రథమంగా అభ్యసించిన కళ శిల్పకళే అనడంలో అతిశయోక్తి ఏమీలేదు. ప్రాచీన శిలాయుగంలోని ఆదిమానవులు జంతువులను వేటాడేందుకు, మాంసాన్ని కోయడానికి, ఆత్మరక్షణకూ అనేకరకాల రాతిపనిముట్లను తయారు చేసాడు. ఈ ప్రక్రియనుండే శిల్పకళ ఉద్భవించింది.

## మూల విరాట్టు బృహత్ శివలింగం

కూసుమంచి గణపేశ్వరాలయంలో చాలా ప్రత్యేకంగా చెప్పుకోవలసిన విషయం మూలవిరాట్టుగా వున్న అతిపెద్ద శివలింగం గురించే. ఆకారంలో పెద్దగా వుండటమే కాకుండా నిర్మాణంలోనూ చాలా ప్రత్యేకతలు ఈ శివలింగంలో వున్నాయి. దీనిని నల్ల గ్రానైట్ రాయి లేదా నల్ల సేనపు రాతి(డోలరైట్)తో చేసి వుంటారు. ఇది చాలా కఠినమైన రాయి అయినా సరే శిల్పులు నునుపుదేల్చి లోహపు అద్దంలా తీర్చిదిద్దారు. భూమి పైననే సుమారు ఏడడుగుల పైన ఎత్తువుంటుంది. వెయ్యిస్తంభాలగుడి, రామప్ప, పిల్లలమర్రిలలో ఇదే ఆకారంలో వున్న శివలింగాలున్నాయి కానీ ఇంత పరిమాణంలో లేవు.

## బాహ్యనేత్రాలకు అంతర్లింగం, అంతర్నేత్రానికి బృహద్లింగం

గుడిలో మామూలు సందర్శనకు వెళ్ళి దేవుని దర్శనం చేసుకుంటే కేవలం గర్భగుడిలోని అతిపెద్ద ఏకశిలా విగ్రహం కనిపిస్తుంది. అది నునుపుదేలిన లోహరూపంలో దర్పంగా హుందాగా నిలబడినట్లు ఉంటుంది. గుడిచుట్టూ ప్రదక్షిణలు చేసి దేవాలయాన్ని అంతర్నేత్రంతో పరికిస్తే, విహంగ వీక్షణ రూపంలో చూపును సారిస్తే మొత్తం దేవాలయమే ఒక మహాలింగంలా కనిపించటం ఇక్కడి అద్భుతం. సాధారణంగా గుడి గోపురాలను కోసుగా పైకి తీసుకెళుతూ కడతారు. కానీ ఈ దేవాలయ గర్భాలయ గోపురం ఒక సంక్లిష్ట నక్షత్రాకారంగానూ, లింగాకారంగానూ కనిపిస్తుంది. గుడిని నిలబెడుతూ నిర్మించిన ప్రదక్షిణపథం దక్షిణం వైపు నుంచి విహంగవీక్షణ (ఏరియల్ వ్యూ) చేస్తూ గమనిస్తే పానవట్టం లాగా అనిపిస్తుంది, తూర్పువైపు క్రిందకి వున్న మెట్లదిశ పానవట్టం చివరి భాగం గానూ అర్థమై మనకి ఆశ్చర్యాన్ని కలిగిస్తుంది.

ఇలా శివలింగాకారం కనిపించడం యాదృచ్ఛికంగా జరిగిన విషయం కాదనీ, ఆలయ రూపకర్తలు మొత్తం దేవాలయాన్నే ఒక బృహత్తర శివలింగంగా భావించి వుంటారనేందుకు మరో ఆధారం కూడా వుంది. అది ఆలయానికి దక్షిణ దిశలో వున్న ముక్కంటేశ్వరాలయం. ఈ ఉపాలయంలో కూడా మధ్యలోని గర్భగుడిలో శివలింగమే వుంది. కానీ ఈ శివాలయపు ఆలయసముదాయం మొత్తం తూర్పుకు కాకుండా ప్రధానాలయం వైపుకు అంటే ఉత్తర దిశకు తిరిగివుంటుంది. ముక్కంటేశ్వరాలయం ముందు నిలబడి గమనిస్తే ప్రధానాలయ బృహత్ లింగ స్వరూపం గోచరిస్తుంది. గణపేశ్వరాలపు బృహద్లింగరూప రహస్యాన్ని విప్పి చెప్పేందుకే ఈ ముక్కంటేశ్వరాలయాన్ని ఇలా నిర్మించివుంటారేమో అనిపిస్తుంది.

## శివలింగ నిర్మాణం వెనకున్న కొన్ని సాంకేతిక విషయాలు

శివం అనే పదానికి అర్థం శుభప్రదమైనది అని. లింగం అంటే సంకేతం అని అర్థం. శివ లింగము హిందూమతంలో ఒక పవిత్ర చిహ్నం. పూర్వం శివుడిని విగ్రహ రూపంలోనే పూజించే వారు. హరప్పా శిథిలాలలో ఒక  పశుపతి విగ్రహం కూడా దొరికింది వరాహపురాణం లోని వేంకటేశ్వర స్వామి అవతారానికి సంబంధించిన గాథ ప్రకారం భృగు మహర్షి శాపం వల్ల శివుడికి లింగరూపంలోనే కానీ విగ్రహరూపంలో పూజలు అందటం లేదట.

## శివలింగంలోని భాగాలు

గణపేశ్వరాలయంలోని శివలింగాన్ని మానుష లింగం అంటారు. మానుష లింగాలయిన శివలింగాలలో శాస్త్ర నిర్మాణ పద్ధతిని అనుసరించి మూడు భాగాలుంటాయి. వాటిలో భూమిలో వుండే చతురస్రాకార భాగాన్ని బ్రహ్మ భాగము అంటారు. దాని పైన అష్టదళ రూపంలో వున్న పీఠభాగాన్ని విష్ణుభాగము అంటారు. పైన స్తూపాకారంలో వున్నభాగాన్ని శివభాగము అంటారు. ఈ మూడు భాగాల పొడవులు సమానంగా వుంటే దానిని సర్వసమ లింగం అంటారు. వీటి పొడవులు వేర్వేరుగా వుంటే వాటిని



(a) SARVA - SAMAM
(b) SAMAA-SAMAM (c) VRIDHAYUTHARAM ĪŚAADHIKAM

వృధాయుధరం, ఇషాధికం అనే పేర్లతో పిలుస్తారు. వివరాలు పటంలో చూడవచ్చు.

శివ లింగములను వాటి నిర్మాత ఎవరు అనేదాని ఆధారంగా వాటిని వర్గీకరిస్తారు. స్వయంభూ లింగములు అంటే స్వయముగా వాటి అంతట అవే వెలసినవి. దైవిక లింగములు అంటే దేవతల చేత ప్రతిష్టింపబడినవి. రుష్య లింగములు అంటే రుషి ప్రతిష్టితాలు. మానుష లింగములు అంటే మానవ నిర్మిత లింగములు. బాణ లింగములు అంటే నర్మదా నదీతీరాన దొరికే తులా పరిక్షకు నెగ్గిన బొమ్మరాళ్ళు(పెబుల్సు) గణపేశ్వరాలయంలోని శివలింగం, మానుష లింగం (మానవులచే ప్రతిష్టితం). దీనిలో మూడుభాగాలుంటాయి. మనకి పైన శివలింగం ఎంత కనిపిస్తుందో ఆ నిష్పత్తి ప్రకారం అంతటి నిర్మాణం పీఠభాగం లోపల కూడా వుంటుంది.

## శివలింగాన్ని తాకే ఉదయ కిరణాలు

గర్భాలయంలోని శివలింగాన్ని ఉదయపు సూర్యకిరణాలు సరాసరి తాకుతాయి. తూర్పుకు అభిముఖంగా వుండటం, పరిమాణ రీత్యా పెద్దగా వున్న ద్వారబంధం వుండటం. ద్వారానికీ గర్భాలయానికీ మరీ ఎక్కువ దూరం లేకపోవడం వల్ల ఇది సాధ్యపడుతోంది. ఇది ఆధ్యాత్మికంగా ప్రత్యేకమైనది, ఆరోగ్యపరంగా ఉపయుక్తమైనది.

## రాళ్లను అంటించలేదు కలిపారు




మనం ఇప్పుడు కట్టడాలకోసం సిమెంటు కాంక్రీటుల మీదనే ఆధారపడుతున్నాం. గణపేశ్వరాలయం నిర్మాణంలో మాత్రం అతికించేందుకు సిమెంటు, సున్నం వంటి పదార్థాలను వాడలేదు. రాళ్ళను ఒకదానికి ఒకటి రంధ్రము, కూసము పద్దతిలో కలుపుకుంటూ పేర్చుకుంటూ కట్టారు. దీనిని ఇంటర్ లాకింగ్ విధానం అంటారు. అంటే ఇప్పుడు చెక్కకుర్చీలు, మంచాలను బిగించే పద్ధతి లాంటి విధానాన్ని వాడారు. కాలక్రమంలో భూకంపాలు వంటివి సంభవించినా సరే తట్టుకునేంత పటిష్టంగా ఈ రాళ్ళను పేర్చి బిగించారు. అందువల్లనే శతాబ్దాలు గడిచినప్పటికీ ఇప్పటికీ చెక్కుచెదరకుండా ఆలయం మనముందు గర్వంగా నిలబడివుంది.

## రాతిని పేర్చడంలోనూ ఎంతో జాగ్రత్త

రాళ్ళను ఒకదానితో ఒకటి పేర్చటమే కాదు. వాటిని అమర్చిన క్రమంలోనూ అనేక జాగ్రత్తలు తీసుకున్నారు. రంగమండపం మూడువైపులా నిర్మించిన మెట్లను పరిశీలిస్తే ఈ విషయం తెలుస్తుంది. ఒక మెట్టుకోసం వాడిన రాతిని ఎడమవైపు గోడలోపటికి వుండేలా అమర్చితే, దాని తర్వాతి మెట్టుకు వాడిన రాతిని కుడివైపు గోడలోకి బిగించారు. ఇలా ఏకాంతర (ఆల్టర్‌నేటివ్) పద్ధతిలో రాళ్ళను బిగించుకుంటూ రావడం వల్ల మెట్లను తవ్వ కుండా పక్కనున్న గోడలు రక్షణగా వుంటాయి. వరదలూ భూకంపాలకు చెదిరిపోకుండా పట్టివుంచుతాయి కూడా. రంగమంటపంకోసం వాడిన రాతిని చదునుగానే కాక కావలసి నంత మందంగా వుండేలా ఎంచుకున్నారు. ముక్కంటేశ్వరాలయపు రంగమండపపు రాతిని పక్కనే వున్న స్తంభాల క్రిందకి చేరేలా కలిపారు. నక్షత్రాకార పునాది నిర్మాణంలో అంచుల దగ్గరవున్న రాళ్ళు జారిపోకుండా పట్టుతో వుండేంతగా లోపటికి నెట్టి బిగించారు.

## నీడలు తాకనంత దూరంలో ఉపాలయాలు

గణపేశ్వరాలయం సమీపంలోవున్న ఉపాలయాలు లేదా సహాలయాల మధ్య దూరం వేర్వేరుగా వుంటుంది. ప్రధాన ఆలయం నీడ ఉపాలయాలపై కానీ ఉపఆలయాల నీడ ప్రధానాలయంపై కానీ పడదు. అలాగే ఒక ఉపాలయం నీడ మరో ఉపాలయం మీద కూడా పడదు. అందుకు అనుగుణంగానే వీటి దూరాలను ఏర్పరచారు. ప్రధానాలయం ఎత్తు ఎక్కువ కాబట్టి దానికీ ముక్కంటేశ్వరాలయానికీ దూరం కొంత ఎక్కువగా వుంటుంది. కానీ ముక్కంటేశ్వరాలయానికీ వేణుగోపాలస్వామి ఆలయానికి మధ్యదూరం మాత్రం వాటి ఎత్తులు తక్కువగా వున్నట్లే తక్కువగా వుంటుంది. ఉత్తరాయణం, దక్షిణాయణం కాలాలలో సూర్యుడి దిశ మారినప్పటికీ, ఉదయం సాయంత్రాలలో నీడల పొడవు బాగా పెరిగినప్పటికీ, రుతువులలో మార్పు వున్నప్పటికీ ఆ నీడలు మరో ఆలయాన్ని తాకవు.

## నంది విగ్రహం పై ఎన్ని నగిషీలో !

గణపేశ్వరాలయంలోని శివలిం గానికి ఎదురుగా ఒక నంది విగ్ర హము, బయటి



రంగమంటపంలో మరో నంది విగ్రహమూ వున్నాయి. బయటిది పాతకాలపు రాతినంది. కొంత శిధిలం అయివుంది. బహుశా ఇది గుడి నిర్మాణ సమయంలో చెక్కినది అయివుండొచ్చు. లోపటి విగ్రహాన్ని తర్వాతి కాలంలో ఏర్పాటు చేసారు.

బహుశా ఊరిబయట వున్న దేవాలయం కావడంతో రక్షణ తక్కువని కొత్తవిగ్రహాన్ని ఆలయం లోపటే హుండీకి వెనుకగా అమర్చారు. బయటి నందిపై అలంకరణలు రమ్యమైనశైలిలో చెక్కబడివున్నాయి. మెడలో గంటలు, అలంకరణ దండలు, కాలి పట్టెడలు వంటివి వున్నాయి. వాటి నిర్మాణంలో శిల్పి నైపుణ్యం కనిపిస్తుంది. అంతే కాకుండా నంది వీపుపై ఒక తాడు ముడి వుంది. దానిని సాధారణంగా ఏనుగుముడి అంటారు. ఆంగ్లంలో రీఫ్ నాట్. ఇది చాలా గట్టిముడి. వ్యవసాయ పనుల్లోనూ, సైనిక శిబిరాల ఏర్పాటులోనూ ఈ ముడి ఉపయోగం చాలా ఎక్కువ. ముడిని ఎలా వేయాలో అర్థం అయ్యేంత విపులంగా చెక్కారంటే శిల్పాల నిర్మాణంలో అలంకరణకే కాక ఉపయోగానికీ ప్రాధాన్యత నిచ్చారని తెలుస్తోంది. ముఖ్యమైన విషయాలు వారితోనే అంతరించిపోకుండా తర్వాతి తరాలకు అందేందుకు వీటిని సాధకాలుగా వాడుకున్నారు.

## ఉపాలయ స్తంభాలు



దేవాలయ స్తంభాలు కేవలం పై కప్పును మోసేందుకు మాత్రమే కాదు, అలంకరణ కోసం కూడా వాడారు. గణపేశ్వరాలయంలో ప్రధాన ఆలయానికి కానీ రంగమంటపానికి కానీ ఎటువంటి స్తంభాలనూ వాడలేదు. కానీ పక్కనే వున్న ముక్కంటేశ్వరాలయానికీ, వేణుగోపాలస్వామి ఆలయానికీ కాకతీయ నిర్మాణ శైలిని ప్రతిబింబించే స్తంభాలను నిర్మించారు. స్తంభాన్ని వివిధ ఆకృతుల సమ్మేళనంగా చెక్కడమే కాక, దానిపై రాజహంసలను మరికొన్ని అందమైన ప్రతిమలను మలచారు. స్తంభం చివర దూలాలను పట్టుతో మోసేందుకు అనుగుణంగా + (ప్లస్) ఆకారంలో ఆధారాలను ఏర్పాటు చేయటం ఇక్కడి స్తంభాలలో ప్రత్యేకత. అటువంటి స్తంభాలనే ప్రధానాలయం ముందు కూడా గమనించవచ్చు.

దేవాలయ స్తంభాలను వాటి ముఖాల ఆధారంగా వేర్వేరు పేర్లతో పిలుస్తారు. నాలుగు ముఖాలుండే స్తంభాలను రుచక అని ఎనిమిది ముఖాలుంటే 'వజ్ర' అని పదహారు ముఖాలుంటే ద్విగుణ వజ్ర అని ముప్పైరెండు ముఖాలుంటే 'ప్రతినక'మని అంటారు. ఇక్కడి స్తంభాలలో ఒకే స్తంభంలో వివిధ ఆకారాల మేళవింపును క్రమమైన పద్ధతిలో నిర్మించుకుంటూ వెళ్ళారు. మంటపంలో వున్న కొన్ని స్తంభాలపై ప్రత్యేకమైన శైలిని కూడా ప్రదర్శించారు. అలాకాకుండా స్థూపాకారంలోని స్తంభాలు గుండ్రంగా వృత్తాలవలే వుంటే వాటిలోని సూక్ష్మవ్యత్యాసాల ఆధారంగా బ్రహ్మకాంత, విష్ణుకాంత, సౌమ్యకాంత, మరియు రుద్రకాంత అనే పేర్లతో పిలుస్తారు.

# ఉపాలయాలు

## ముక్కంటేశ్వరాలయం

గణపేశ్వరాలయానికి దక్షిణదిశలో ప్రధానాలయానికి దగ్గరలో ఈ ముక్కంటేశ్వరాలయం వుంది. దీనిలో ఒకే నిర్మాణంలో పక్కపక్కనే మూడు అంతరాలయాలు ఒకే రంగమంటపం ద్వారా కలపబడి వుంటాయి. రంగమండపానికి ఒక్కో వరుసకు పది స్థంభాల వంతున మూడు వరుసల్లో ముప్పై స్తంభాలున్నాయి. ఇవిగాక ఆలయానికి ఉత్తర దిశగా ప్రధాన ఆలయం వైపుకు తోరణం (పోర్టికో) లాగా మరో రెండు స్తంభాలున్నాయి. వీటితో కలిపి మొత్తం 32 స్తంభాల ఈ మండపం చూసేందుకు చాలా అందంగా వుంది. వరుసగా వున్న మూడు అంతరాలయాల్లో మధ్యలో వున్న గర్భాలయం ప్రధానమైనది అని సూచిస్తున్నట్లుగా వుంటుంది. దాని ముందున్న నాలుగు స్తంభాలు ప్రత్యేకమైన శిల్ప నిర్మాణాన్ని కలిగివున్నాయి. ప్రధానాలయంలోని శిల్పం కంటే ఇక్కడి ఆలయంలోని శిల్పరీతి ఆకర్షణీయంగా వుంటుంది. మండపంలోని అందమైన హంసలవంటి శిల్పాలలోనూ, ఇతర శిల్పాలలోనూ సునిశితమైన పనితనం కనిపిస్తుంది. మూడింటి మధ్యలోని గర్భాలయానికి ఎదురుగా వున్న నాలుగు స్తంభాల మధ్య రంగమండపం వుంది. రెండు అంతరాలయాల్లో నిర్మాణపరంగా ఏమాత్రం దెబ్బతినని శివలింగాలు వున్నాయి. అవి ఈనాటికీ పూజకు నోచుకోలేదు.



**ముక్కంటేశ్వరాలయం పునాది చిత్రం**

ఈ ఆలయం ఉత్తర దిశకు తిరిగి వుండటం ప్రత్యేకత. ఈ ఆలయాన్ని రక్షిత కట్టడాల జాబితాలో చేర్చారు. అయినప్పటికీ మండపం పైన పిచ్చిమొక్కలు విపరీతంగా

పెరిగివున్నాయి. స్తంభాలూ, మండపమూ మరింతగా కూలిపోకుండా వుండేందుకు రక్షణ చర్యలు తీసుకుంటున్న ఛాయలు కనిపించడంలేదు. కనీసం చుట్టూ కంచె లేదా సరిహద్దుల ఏర్పాట్లేమీ లేవు. ఈ మధ్యకాలంలోనే ఈ గుడిలోని రంగమండపాన్ని యంత్రాలను ఉపయోగించి పగలగొట్టారు. అడుగుకు పైగా మందం వున్న బండను కత్తిరించి లోపల తవ్వకం చేసినట్లు ఆధారాలు కనిపిస్తున్నాయి. ఇదే విధంగా నిర్లక్ష్యం కొనసాగితే ఈ ఆలయం త్వరలోనే పూర్తిగా శిథిలం అయ్యే అవకాశాలున్నాయి. కేవలం ప్రధాన ఆలయం వరకే స్థలాన్ని సేకరించి దానివరకు మాత్రమే ఒక సరిహద్దుగోడను నిర్మించారు. అందువల్ల ఇటువైపు ఇంత ప్రాముఖ్యత వున్న ఉప ఆలయాలు వున్నట్లే సందర్శకులకు తెలియడం లేదు. శిథిలాలయ ఆవరణమంతా పిచ్చిమొక్కలతో నిండి వుండటం వల్ల ఆలయరూపమే కనిపించడంలేదు. పైగా ఇటువైపు రావాలంటే భయపడేలావుంది.

## వేణుగోపాల స్వామి ఆలయం

ప్రదాన ఆలయం మరియు ముక్కంటేశ్వరాలయాలకు మరింత దక్షిణాన చిన్నదిగా కుదురుగా వున్న ఈ ఆలయం అత్యంత శిధిల స్థితిలో వుంది. దీనిలో ప్రధాన గర్భగుడికి ముందు ఒక్కో వరుసలో 4 స్తంభాల లెక్కన నాలుగు వరుసలుగా పదహారు స్తంభాల ఆలయమండపం వుంది. ఇవిగాక తూర్పున మరో రెండు స్తంభాలు పోర్టికోలాగా అమర్చివుంటాయి. వాటితో కలిపి 16+ 2 మొత్తం పద్దెనిమిది స్తంభాల మండపంతో ఈ ఆలయం నిర్మించబడింది. ఈ పదహారు స్తంభాలలో కూడా ప్రధాన ఆలయానికి ముందున్న నాలుగు స్తంభాలు ముక్కంటేశ్వరాలయంలో మాదిరిగానే ప్రత్యేక శిల్పరీతిని కలిగివున్నాయి.



వేణుగోపాల ఆలయం పునాది చిత్రం

చాలా కాలం క్రిందటి వరకూ మురళిని వాయిస్తున్న వేణుగోపాలుడి విగ్రహం ఇందులో వుండేదట. ఈ ఆలయం చుట్టుపక్కలున్న పొలాలకు చెందిన గ్రామస్తులు ఆ విగ్రహాన్ని చూసినట్లు వారి అనుభవాన్ని పేర్కొన్నారు. వేణుగోపాలుడు వైష్ణవ సంబంధమైన దేవుడు. శైవాలయ ప్రాంగణంలో

వుండటం ఒక విశేషం. ఒకే ఆలయ ప్రాంగణంలో హరిహరులిద్దరూ ప్రాధాన్యత కలిగివుండటం కాకతీయుల మతసామరస్యానికి ప్రతీక. ఈ పద్ధతిలో హరిహరాద్వైతాన్ని చాటిచెప్పేనిర్మాణాల ఉదాహరణలు చాలా వున్నాయి. వరంగల్ లోని కాశీబుగ్గలో శ్రీరంగనాథ ఆలయంలో ఈశ్వరుని పానవట్టము మీద శ్రీరంగనాథ స్వామి విగ్రహము చెక్కబడివుంది. ఓరుగల్లు సమీపంలోని శాయంపేట హవేలీలోని పాంచాలరాయ స్వామి దేవాలయంలో కూడా పానవట్టం మీదనే పాంచాలరాయ స్వామి విగ్రహం చెక్కబడింది. వరంగల్ కోటలో ఒక పాడుబడిన దేవాలయంలో పానవట్టం మీదనే శ్రీదేవీ భూదేవీ సహిత విష్ణుమూర్తి విగ్రహం ప్రతిష్ఠింపబడింది. వేయిస్తంభాల గుడి త్రికూటాలయంలో శివ-వాసుదేవ-సూర్యాలయాలను నిర్మించారు. అక్కడే నృత్యనృసింహుని విగ్రహాన్ని చెక్కించారు. పాలంపేట దేవాలయంలో సైతం శ్రీకృష్ణుని విగ్రహంతో పాటు రంగమంటపం పైభాగంలో చెక్కిన క్షీరసాగర మధనం వంటి అనేక విష్ణులీలలు కనిపిస్తాయి. ఇవన్నీ కాకతీయులు శైవ-వైష్ణవ మతాలను సమన్వయ పరచుతూ ప్రజలలో సామరస్యాన్ని పెంచేందుకు తీసుకున్న చర్యలుగా అర్థం చేసుకోవచ్చు. ఇదే పద్ధతిని పోతన,శ్రీనాథాదులు పాటిస్తూ తమ రచనలలో హరిహరనాథ సృష్టి చేసారు. కాకతీయ ప్రోలరాజు సామంతుడైన వేమబోల మల్లినాయకుడు మాటేడులో అలాంటి త్రికూటాలయాన్ని నిర్మించాడు. కాకతి రుద్రదేవుడు అనమకొండ(హన్మకొండ) లో వేయిస్తంభాల గుడిని అదే పద్ధతిలో కట్టించాడు. పిల్లలమట్టి రామిరెడ్డి తన పేరుతోనూ తన తల్లిదండ్రుల పేరుతోనూ త్రికూటాలయాలను నిర్మించాడు. ఐనవోలు, కుందారం, కారపాములు, కొండపాక, నాగులపాడు, పానగల్లు మొదలైన చోట కూడా ఇలాంటి త్రికూటాలయాలు కనిపిస్తాయి.

## వేణుగోపాలస్వామి ఆలయం దక్షిణ దిశకు ఎందుకు తిరిగివుంది?

సాధారణంగా దేవాలయాలు తూర్పుదిశగానే తిరిగి వుంటాయి. యముడు దక్షిణ దిక్కుకు అధిపతి. యమలోకాధిపతి కూడా! ప్రతిప్రాణి యొక్క పాప పుణ్యాలను తరచి చూసి శిక్షలు అమలు జరిపే ధర్మ దేవత! ఈ లక్షణమే, ఈ ధర్మమే, ఈయనకు మిగతా దేవతల కంటే ఉగ్రమైన రూపాన్ని ఇచ్చింది. అందుకేనేమో యమదిశగా చూస్తున్నట్లు సాధారణంగా దేవాలయాల నిర్మాణం చేయరు. కానీ ఈ ఆలయ సముదాయాలలోని వేణుగోపాల స్వామి ఆలయం మాత్రం దక్షిణ దిశగా తిరిగి వుంది.

గర్భాలయంలోని మూల విరాట్టు దక్షిణ దిశలోకి దృష్టిని సారించేలా వున్న నిర్మాణాలు మేథో దక్షిణామూర్తి ఆలయాల్లోనూ, కొన్ని మృత్యుంజయ నరసింహాలయాల్లోనూ, చిరంజీవి అయిన ఆంజనేయస్వామి ఆలయాల్లో తప్ప అరుదుగా చూస్తాం. అటువంటి అరుదైన ఆలయమే గణపేశ్వరాలయానికి ఉపాలయంగా వున్న ఈ వేణుగోపాల స్వామి ఆలయం కూడా. మరి ఈ వేణుగోపాలుడు దక్షిణ దిశను చూడటంలో ప్రత్యేకత ఏమిటి? అనేదానికి

సమాధానంగా మరో ధర్మసూక్ష్మంలా వాస్తు, శాస్త్ర కోణాన్ని కూడా చూడవచ్చు. శివకేశవాలయాలు ఒకే ప్రాంగణంలో ఉంచాల్సి వచ్చినపుడు వాటి శక్తిపాతం సన్నగిల్లకుండా వుండేందుకు అనువుగా వాటి దిశానిర్ణయం చేస్తారు. ఇక్కడ ఆలయాల సమిష్టి ప్రాంగణంలో శివాలయం ప్రాథమికంగా వుంది కాబట్టి, ఆ ఆలయానికి మధ్యలో ముక్కంటేశ్వరాలయం దానికి వెనుకగా అన్నట్లు వేణుగోపాలుడు వున్నాడు. భౌగోళిక వాస్తురీత్యా దక్షిణ దిశను చూస్తున్నట్లు వుంటాడు కానీ, ఆలయ సముదాయపు దృష్టితో చూస్తే త్రికూటాలయదిశకు వ్యతిరేకంగా అవతలి దిశను చూస్తున్నట్లుంటాడు. మరోలా చెప్పాలంటే త్రికూటాలయం వెనుక భాగం వేణుగోపాలుడి సంరక్షణలో వుంటే, వేణుగోపాలుడి వెన్నుకాస్తున్నట్లు త్రికూటాలయం వుంటుంది. ఇక్కడ మరో చమత్కారం ఏమిటంటే వేణుగోపాలుడు చూస్తున్న దిశగా భక్తుల ప్రవేశంకాక సాధారణ ఆలయాలలో మాదిరి గానే తూర్పుదిశనుంచి ఆలయంలోకి ప్రవేశించే పద్ధతిలో మంటప నిర్మాణం చేపట్టారు.

ఈ సంక్లిష్ట నిర్మాణం సౌందర్యం ఈ ఆలయ ప్రత్యేకత. దీనిని ఆలయనిర్మాణ పద్ధతులను అధ్యయనం చేసిన వారు పరిశీలిస్తే దీనిగురించి మరెన్నో కొత్త సంగతులు బయటకు వచ్చే అవకాశం వుంది. ఈ వేణుగోపాలుడి ఆలయం ఇప్పటికీ రక్షిత కట్టడాల జాబితాలోకి రాలేదు. ఇప్పటికే ఒక మూలగా వున్న స్తంభం దాదాపు విరిగి పడిపోయే దశలో వుంది. దానిని కాపాడేందుకు తగిన ఆధారాన్నివ్వడమో లేదా మరో స్తంభం వాడి పునర్నిర్మించడమో చేయకపోతే మొత్తం ఆలయమే శిథిలం అవుతుంది. ఆ ఒక్క స్తంభం కూలితే మొత్తం కాకతీయ నిర్మాణ శైలిని ప్రతిబింబించే మండపమే చేజారిపోతుంది. అందుకే ప్రభుత్వమే కాకున్నా స్థానికులైనా ఈ విషయంలో కొంత శ్రద్ధను చూపించగలిగితే ఆలయాన్ని రక్షించుకోగలం. అదే విధంగా ఈ ఆలయసముదాయానికి కూడా ప్రధానాలయానికి అనుబంధంగా సందర్శన మార్గాన్ని ఏర్పరచాలి. రక్షణగోడను కూడా నిర్మించాల్సివుంది.

## నలుదిక్కులా విస్తరించిన ఆలయశోభ

కూసుమంచిలో గణపేశ్వరాలయం నిర్మించే సమయంలోనే గణపతి మహారాజు ఆనాటి పండితుల సూచనల మేరకు ఆలయం చుట్టూ మరిన్ని దేవాలయాలను నిర్మించారని చెబుతారు. గణపేశ్వరాలయానికి సుమారు 5 కి.మీ. దూరంలో నాలుగు దిక్కులా వివిధ ఆలయాలు ఉన్నాయి. దక్షిణదిశగా వేణుగోపాలస్వామి ఆలయం ఉంటే, ఈశాన్యం మూలన జీళ్ళ చెరువు గ్రామంలో శివాలయం ఉంది. ఆగ్నేయంలో పెరిక సింగారం గ్రామంలో, వాయవ్యం వైపున పాలేరు గ్రామంలో వేణుగోపాలస్వామి ఆలయాలు ఉన్నాయి. అయితే, నైరుతిలోని వేణుగోపాల స్వామి ఆలయం మాత్రం వెలుగులోకి రాలేదు. జీళ్లచెరువు

గ్రామంలో శివాలయం, పెరిక సింగారం గ్రామంలో ఉన్న వేణుగోపాలస్వామి ఆలయంలోని దేవుళ్లు ప్రస్తుతం పూజలందుకుంటున్నారు. పాలేరు గ్రామంలోని ఆలయం శిథిలావస్థకి చేరటంతో గ్రామస్తులు నూతన ఆలయాన్ని నిర్మించారు. గణపేశ్వరాలయ ప్రాంగణంలోని ఈశాన్య మూలలో నవగ్రహాల ఆలయం, ఆగ్నేయంలో ఆంజనేయస్వామి ఆలయాలను ఏర్పాటు చేశారు.

వేయిస్తంభాల గుడిలోనూ, రామప్ప గుడిలో కూడా రుద్రుని చిత్రించి చుట్టూ రుద్రశిల్పీకరణకు అనువైన చిత్రాలను చెక్కారు. బహుశా ఏదైనా ప్రత్యేక పద్ధతిలో రుద్రుని ఆలయం చుట్టూ కూడా ఇటువంటి దేవాలయాలను నిర్మించారేమో.

**రుద్రరూపధ్యాన శ్లోకం రుద్రాధ్యాయంలో ఇలా వుంది.**

అథ శ్రీ రుద్రరూపాన్ ధ్యాయేత్–
శుద్ధస్పటిక సంకాశం త్రినేత్రం పంచవక్త్రగం
గంగాధరం దశభుజం సర్వాభరణ భూషితం
నీలగ్రీవం శశాంకాంకం నాగ యజ్ఞోపవీతినం...
దిగ్దేవతాసమాయుక్తం సురాసుర సమస్కృతం
నిత్యం చ శాశ్వతం శుభ్ర ధ్రువ మక్షర మవ్యయం
సర్వవ్యాపిన మీశానం రుద్రవై విశ్వరూపిణం–

రుద్రుని చుట్టూ వుండే అష్ట దిక్పాలకుల వివరాలు ఇవి. రుద్రుడు, రుద్రాలయాల చుట్టూ సాంప్రదాయకంగా వుండే శిల్పాలు, ఆలయాల గురించి అర్థం చేసుకునేందుకు ఇది కొంతమేరకు సహకరిస్తుంది.

| దిశ | దిక్పాలురు | భార్యలు | వాహనం |
|---|---|---|---|
| తూర్పు | ఇంద్రుడు | శచీదేవి | ఐరావతం |
| ఆగ్నేయం | అగ్ని | స్వాహాదేవి | మేషము |
| దక్షిణం | యముడు | ధూమోర్ణ, విజయ | మహిషము |
| నైరుతి | నిర్పతి | దీర్ఘాదేవి | నరుడు |
| పశ్చిమము | వరుణుడు | కాళిక | మకరం |
| వాయువ్యం | వాయువు | అంజన | జింక |
| ఉత్తరం | కుబేరుడు | చిత్రరేఖ | సింహం |
| ఈశాన్యం | ఈశానుడు | గౌరి | వృషభం |



## చెరువు గట్టున గంగాదేవి ఆలయం, వీరగల్లు పూజ

గంగామాత ఆలయంగా ఇప్పటికీ ప్రజలు కొలుస్తున్న ఒక ఆలయం గణపేశ్వరాలయానికి దగ్గరలో గంగాదేవి చెరువు గట్టుపై వుంది. ఈ ఆలయం పక్కనే నిలబెట్టిన మూడు వీరగల్లులున్నాయి. వీరగల్లు అంటే ఒక్కప్పటి స్థానిక వీరుల స్మారక శిలావిగ్రహరూప శాసనాలు. అప్పటి చరిత్రను అర్థం చేసుకోవడానికి ఇవి ప్రధానమైన ఆధారాలు.

యుద్ధాల్లో మరణించిన వీరుల జ్ఞాపకార్థం గ్రామాల పొలిమేరల్లో ప్రతిష్టించిన ఇటువంటి రాళ్లు రాష్ట్రమంతటా గ్రామ గ్రామంలో దొరికాయి. మరణించిన తరువాత కూడా ఆ వీరులు భైరవ, వీరభద్ర రూపాల్లో గ్రామాలని రక్షిస్తారని గ్రామస్థులు నమ్మి, వాళ్లకు ఊరిబయట గుళ్లు కట్టి పూజలూ, బలులూ ఇచ్చే ఆచారం చాలాచోట్ల ఈనాటికీ ఉంది. ఆ రాళ్ళపై వాళ్ల వీర కృత్యాలు, యుద్ధంలో ఘట్టాలు బొమ్మలుగా చెక్కి, వాళ్ళు చేసిన సాహసాల గురించి రాసారు. వీరగల్లు శాసనాలు ఆనాటి పరిస్థితులకి అద్దం పడతాయి. చిన్నచిన్న రాజ్యాలు, నలువైపులా శత్రువులు, అలివిమాలిన పన్నుల భారం, యుద్ధాలు, దోపిడీలు, పశువుల మందలపై దాడులు, సామాన్య ప్రజలకి రక్షణలేని కాలం కొన్నాళ్ళు నడిచింది. మధ్యయుగంలో భారతదేశంలోనే గాక ప్రపంచమంతా భుక్తి కోసం యుద్ధం చేసే మెర్సినరీ




*గంగామాత ఆలయం, పక్కనే వీరగల్లులు*

యోధుల ప్రస్తావనలు కనిపిస్తాయి. వ్యవసాయం నమ్మకంలేని పరిస్థితిలో కత్తి పట్టడం వచ్చిన క్షత్రియులు కానప్పటికీ ఇతర వర్ణాల యువకులు ఎందరో ఆ దారిపట్టారు. స్వతంత్రంగా ఏ రాజుకూ లోబడక వీరభోజ్యంతో కడుపు నింపుకునే తెలుగు వీరులను ఒంటర్లు, ఎక్కట్లు అని పిలిచారు. ఈ పదాలే సాహిత్యంలో సంస్కృతీకరించబడి ఏకాంగ వీరులుగా మారాయి. ఏకాంగవీరుల ప్రసక్తి క్రీడాభిరామం, భీమేశ్వరపురాణం, పల్నాటి వీర చరిత్రలలో చూస్తాం.

యుద్ధంలో ఓడి ఆత్మహత్యకి పాల్పడిన వీరులు చాలా మంది ఉన్నారు. వీరగల్లులపై గండకత్తెర వేసుకొని, కొండచరియ దూకి ప్రాణాలు విడిచిన వీరుల కథలు జపాన్ సమురాయ్ సంస్కృతిలోని సెప్పుక్కు, హరాకిరీ వంటి ఆచారాలు తలపిస్తాయి. అలాగే పెండ్లాల తలచుక బిట్టేడ్చువారు అని యుద్ధంలో ఆయుధం పారవేసి గడ్డికరిచి మొత్తుకునే పిరికిపందల గురించి పల్నాటి వీర చరిత్రలో శ్రీనాథుడు చెప్పాడు. అంతే కాదు ఓడిన శత్రువుల తలలతో బంతులాటలు ఆడటం (శిరఃకందుక క్రీడావినోదం), వారి రక్తమాంసాలతో ఉడికించిన అన్నం కావలి దేవతలకి ఊరి చుట్టూ పొలిజల్లడం (రణంకుడుపు) వంటి రాక్షస సంస్కృతి వీరగల్లు సాహిత్యంలో కనిపిస్తుంది. ఇలా యుద్ధాలలోనూ, తిరుగుబాట్లలోనూ పాల్గొన్నవారి విగ్రహాలే కాక, ప్రజల ధనమాన ప్రాణాలను కాపాడిన ఉదాత్తులకూ, సతీసహగమనం చేసిన స్త్రీ మూర్తులకు కూడా వీరశిలలను ఏర్పాటు చేసి వారి గౌరవాన్ని చాటుకునే వారు. చెరువు కట్టలు వర్షానికి తెగిపోయి గ్రామమంతా మునగకుండా వుండేందుకు తమ దేహాలనే కట్టలుగా అడ్డంకట్టి గ్రామస్థులను కాపాడినవారికి పూజలందటం (వరంగల్ జిల్లా గణపురంలోని గణపసముద్రం చెరువు దగ్గర గౌండ్లదానిగండి), తరతరాలు వారి పేరును చెప్పుకోవడం ఇప్పటికీ మనం అనేక కథలలో వింటుంటాం. మరి ఈ గంగాదేవి గంగానదికి మారు పేరుగా పెట్టుకున్న దేవతపేరు కాకపోవచ్చనిపిస్తుంది. మరెవరైనా ఉదాత్తచరిత గల మహిళ చేసిన సాహసకృత్యమో, త్యాగపూరితమైన కథ వుండివుంటుంది. ఈ మూడు వీరగల్లులను పరిశీలిస్తే కేశాలంకరణగా పెద్దకొప్పు వుంది, ఎడమ చేతిలో డాలు, కుడిచేతిలో శూలం వంటి ఆయుధాన్ని ధరించారు. మొలలో చురకత్తి లేదా కత్తివంటిది వుంది. ఈ వీరగల్లులు ఏదో పోరాట చరిత్రను గుర్తుకు చేసుకుంటూ ఏర్పాటు చేసినవి అయివుంటాయి. వందల సంవత్సరాలు నిలిచే సాహసమో, త్యాగమో చేసిన ఆ స్త్రీమూర్తికి వందనం.

# గంగాదేవి చెరువు

ఈ దేవాలయం కాకతీయులు కట్టించినదే అని చెప్పేందుకు మంచి ఆధారంగా గంగాదేవి చెరువు కనిపిస్తుంది. కాకతీయుల నిర్మాణంలో టిటిటి అంటే **ట్రిపుల్ టీ** పద్ధతిని అవలంబించారు. ట్రిపుల్ టీ విధానం అనగా టీ (టౌన్) నగరం, టీ (టెంపుల్)ఆలయం, టీ(ట్యాంక్) చెరువు. ప్రకృతి సిద్ధంగా వర్షపు రూపంలో వచ్చే నీటిని నిల్వ చేసుకునే లక్ష్యంతో కాకతీయుల కాలంలో అనేక నిర్మాణాలు జరిగాయి. కాకతీయులు ఊరికి అనుసంధానంగా ఆలయమూ, జలవనరులూ వుండాలనుకున్నారు. ఈ గంగాదేవి చెరువు ఆలయానికి ఈశాన్య దిశలో వుంటుంది. చెరువు ఆధారంగానే అప్పట్లో పంటలు పండించుకునేవారు. వర్షం ద్వారా నగరంలో కురిసిన వర్షపు నీటితోపాటు దగ్గరలోని పెద్ద జలాశయాలనుంచి ఈ చెరువుకు నీరందే ఏర్పాటు చేసారు. చెరువుకు ఎగువలో నగరం, దిగువన పొలాలు వున్నాయి. దానివల్ల నగరానికి వరదముప్పు వుండదు. పొలాలకు నీటి సమస్య రాదు.

కాకతీయ చక్రవర్తులు కల్పించిన నీటిపారుదల సౌకర్యాలను సరస్సులు, చెరువులు, కాలువలు, బావులు అని నాలుగు రకాలుగా విభజించవచ్చు. మొదటి ప్రోలరాజు నుంచి జలాశయాల నిర్మాణం ప్రారంభమైందని చెప్పవచ్చు. ఇతడు కేసీయసముద్రం నిర్మించినట్లు గణపతిదేవుడు వేయించిన మోటుపల్లి స్తంభశాసనం ద్వారా తెలుస్తోంది. రెండవ బేతరాజు అనుమకొండ పట్టణంలో శివపురం పేరుతో తోటను, చెరువును నిర్మించినట్లు మోటుపల్లి శాసనం తెలియజేస్తోంది. గణపతి దేవుడు నెల్లూరు, గంగాపురం, ఎల్లూరు, గణపురం, ఏకశిలాపురంలో అనేక చెరువులు నిర్మించినట్లు ప్రతాపరుద్ర చరిత్ర ద్వారా తెలుస్తోంది. అప్పటికీ ఇప్పటికీ వ్యవసాయం ప్రజల ప్రధాన జీవనాధారం కాబట్టి, కాకతీయులు వ్యవసాయ భూమిని, పంటలను విస్తృతంగా అభివృద్ధిపరిచే చర్యలు తీసుకున్నారు. ప్రధానంగా ...

1) అడవులను నరికించి వ్యవసాయ యోగ్య భూములను అందుబాటులోకి తెచ్చారు.

2) నిరుపయోగంగా ఉన్న భూములను పోడు చేసేవారికి (వ్యవసాయం) పన్నులలో రాయితీ ఇచ్చారు.

3) గ్రామాలకు దూరంగా నిరుపయోగంగా ఉన్న భూములను బ్రాహ్మణులకు, పండితులకు, అధికారులకు, దేవాలయాలకు, అగ్రహారాలుగా, కానుకలుగా, వృత్తులను నిర్వహించుకోవడానికి ఇచ్చి ఆయా భూములను వ్యవసాయం యోగ్యంగా మారేలా చేశారు.

4) రాజ్యంలోని భూమి అంతటికీ రాజే యజమాని కాబట్టి, రాచభూములను సగం ఆదాయాన్ని చెల్లించే రైతులకు (అర్థసీరులు) కౌలుకు ఇచ్చారు. చివరి పద్ధతిని **అడపగట్టు** అనేవారు.

కాకతీయులు చేపట్టిన ఇటువంటి సంస్కరణల వల్ల చెన్నూరు, పాలంపేట, పాకాల, మంథని, ఏటూరు నాగారం, కొత్తగూడ, ఎల్లందు, బయ్యారం, అమ్రాబాద్, శ్రీశైలం ప్రాంతాల్లో కొన్ని లక్షల ఎకరాలు భూమి కొత్తగా సాగులోకి వచ్చినట్లు, ఆయా ప్రాంతాల్లోనే కొన్ని వేల గ్రామాలు ఏర్పడినట్లు, ఆయా ప్రాంతాల్లో దొరికిన శాసనాలు విశదం చేస్తున్నాయి.

## పర్యాటక ఆకర్షణగా పాలేరు జలాశయం

గణపేశ్వరాలయానికి చాలా దగ్గరలోనే పాలేరు జలాశయం వుండటంతో చాలామంది గణపేశ్వరాలయంలోని శివుడిని దర్శించుకోవడంతో పాటు దగ్గర్లోని పాలేరు జలాశయాన్ని కూడా సందర్శిస్తుంటారు. అక్కడి సరస్సులో బోటింగ్ సదుపాయాన్ని వినియోగించుకుంటారు. ఆలయానికి అనుబంధంగా నిర్మించిన గంగాదేవి చెరువును పునరుద్ధరణ చేస్తే మళ్ళీ ఇక్కడ పాడిపంటలు పెంపొందుతాయి. గ్రామం సస్యశ్యామలం అవుతుంది. పర్యాటకానికి మరింత ఆకర్షణీయంగా మారుతుంది.

---

## కూసుమంచి సందర్శన ఒక మరచిపోలేని అనుభూతి

**చక్కటి ప్రశాంత వాతావరణంలో ప్రాచీన శిల్పనైపుణ్యాన్ని, ఆధ్యాత్మిక శోభను ఒకసారి తిలకించడం ఎవ్వరికైనా ఒక మరచిపోలేని అనుభూతినిస్తుంది. చరిత్ర విద్యార్థుల అధ్యయనానికి అనువైన సమాచారమూ లభిస్తుంది. ఖమ్మంజిల్లా పర్యాటక రంగంలో సగర్వంగా చెప్పుకోదగిన ఈ ప్రాంతాన్ని తప్పనిసరిగా ఒక్కసారైనా చూసితీరాల్సిందే.**

# దేవాలయ ఆవరణ లోని శాసనాలు



దేవాలయానికి ఈశాన్యదిశలో నవగ్రహ మండపానికి దగ్గరలో నలుపలకలుగా వున్న రెండు శాసన స్తంభాలున్నాయి. అవి చాలాకాలం క్రితం దేవాలయాన్ని శుభ్రం చేస్తున్న క్రమంలో ఆలయ ఆవరణలో దొరికాయట. వాటిని సిమెంటు చేసి నిలబెట్టారు. నల్లరంగు వేసి వున్నాయి. గణపతిదేవుడు, శివలింగము, ఆవుదూడ, సూర్యచంద్రులు, గరుత్మంతుడు వంటి బొమ్మలు శాసనంపై వున్నాయి.

కాకతీయుల శాసనాలు చాలా వరకూ దానశాసనాలే. ఈ దానం చేయడం వెనక చాలా కారణాలు వుండేవి. దేవాలయాల లోని దూప దీప నైవేద్యాల నిర్వహణకు, దైవసంబంధమైన పండుగలకు, వేడుకగా చేయాల్సిన పనులకు, దేవాలయానికి అవసరమైన మానవ వనరులు అంటే పూజారి మరియు ఆలయాన్ని శుభ్రపరచేవారికి, సంగీత వాయిద్యాలను మ్రోగించటం లాంటి పనులను చేసేవారికోసం కొంత భూమిని దేవాలయ ఆస్తిగా తీసిపెట్టారు. దానిపై వచ్చే ఆదాయాన్ని నిర్వహించుకునేందుకు ఒప్పంద పత్రాలుగా ఈ శాసనాలను వేయించినట్లు తెలుస్తుంది. అందుకనే శాసన పరిభాషలో ప్రధానంగా ఆచంద్రార్కం, చంద్రార్కస్థాయిగా,ఆదిత్య చంద్రులు కలయంత కాలము, చంద్రజలార్క తారకము, నింగి శశులు కలయంత కాలము వంటి పదబంధాలు కనిపిస్తాయి.

గుడి ఆవరణలో వున్న శాసన పాఠంలో **కొండప్పుర వరాధీశ్వర** అని వుంది అంటే ఇందులోని కొండపురం ఇప్పటి నేలకొండపల్లే అయివుండవచ్చు.

# నాణేలూ చరిత్రను చెబుతాయి !!



ద్రవ్యమారకానికి ఉపయోగించిన ఆ కాలం నాటి నాణెములు ఏవి ఆధారంగా దొరికినప్పటికీ అవి కొంత కథనాన్ని తెలియజేస్తాయి. ఇక్కడ దేవాలయ ప్రాంతంలోని పొలాలలోనూ ఇతర చోట్ల దొరికిన నాణేలు చరిత్ర నిర్మాణానికి కాక వ్యక్తులవద్దకు చేరుకున్నాయనే మాట వినికిడిలోవుంది. ఏవైనా నాణేలు దొరికి వుంటే వాటిని చరిత్రను అర్థంచేసుకోవడం కోసం ఉపయోగిస్తే మంచిది.

కాకతీయుల శాసనములలోనూ అప్పటి సాహిత్యంలోనూ వారు ఉపయోగించిన నాణెముల ప్రస్తావన వుంది. వాటిని స్థూలంగా తెలుసుకోవడం వల్ల ఈ ప్రాంతంలో ఏవైనా అటువంటి ఆదారాలు ఎక్కడైనా మరుగున పడివుంటే తెలుసుకునే అవకాశం వస్తుంది. అప్పటి శాసనాలలో గద్యాణములు, మాడలు, రూకలు వంటి నాణెముల ప్రస్తావన వుంది. జడ్చర్ల శాసనంలో కోడూరి గోకర్ణసింగ రూకలు అనే మాట వస్తుంది అంటే ఆ నాణెములపై సింహం గుర్తును ముద్రించడం వల్ల సింగరూకలు అని వ్యవహరించి వుంటారు. అలాగే కేసరిమాడలు అనేది. అమ్రాబాద్ శాసనంలో కొత్తలు అనే నాణేలూ కనిపిస్తాయి. రెండు అడ్డుగలయితే ఒక రూపాయి అని వ్యవహరించేవారు. వరాహాము అంటే పందిబమ్మువున్న బంగారు నాణేలను వరహా అని, దానిలో సగభాగాన్ని మాడ లేదా ప్రతాపము అని పిలిచేవారు. మాడలో పదవ వంతు భాగాన్ని రూక లేదా పణము అని పిలిచేవారు. త్రుణమో ఫణమో అన్న మాటలో ఫణము ఈ ద్రవ్యరూపమే. పాల్కురికి సోమనాథుడు మాడ, అరకాని, కాసు, వీసము, తార అనే నాణెముల గురించి పేర్కొన్నాడు. క్రీడాభిరామంలో సొన్నాటంకములు, నిష్కములు, అని ప్రతాప రుద్ర చరిత్రలో వరహాలు, సువర్ణ టంకములు, సువర్ణ నిష్కములు అనేవి పేర్కొన్నారు. అంటే అప్పటి నాణేలు ప్రధానంగా బంగారము లేదా వెండితో తయారయినవి కావడంతో ఇవి దొరికిన వారు సులభంగాకరిగించి వాటి రూపాన్ని నాశనం చేసి మరేదైనా వస్తువులుగా చేయించారు. ప్రతాపరుద్రుని కాలంలో రాగినాణెములు కూడా అచ్చువేయించినట్లు ఆదారాలు దొరికినవి. వాటిలో ఒకవైపు నంది ప్రతిమ మరొక వైపు అక్షరములలో **కాకతి ప్రతాప రా...య** అని కాకతి ప్రతాపరుద్ర నామము అచ్చులో వున్నాయి. బహుశా ఇటువంటి ఆధారాలను విడిచిపెట్టేందుకు తోడ్పడాలని కూడా కావచ్చు అప్పట్లో ధ్వజస్తంభ నిర్మాణంలో స్థాపన

సమయంలో అప్పటికి వాడుకలో వున్న నాణెములతో పాటు వారివద్ద వున్న నాణేలను అందులో వేయాలని నియమం పెట్టారు. బహుశా ఏదైనా పునరుద్ధరణ సమయంలోనైనా ఇటువంటివి పరిశీలనలోకి తీసుకునేందుకు ఫోటోలుగా తీసుకుని పున్ణ స్థాపితం చేయగలిగినా మంచే జరుగుతుంది. ఆలయ ప్రాంతాలలో దొరికిన ఏ చిన్న ఆధారాలనైనా ప్రభుత్వం స్వాధీనం చేసుకున్నప్పటికీ వాటి నమూనాలను లేదా వాటి ఫోటోలను అదే[ప్రాంగణంలో ప్రదర్శనకు వుంచటం అసలు ప్రతి ఎక్కడుందో దాని దగ్గరే రాసివుంచడం చేయగలిగితే అసలు వస్తువులకు భద్రత కల్పించడంతో పాటు ఆ ప్రాంత చరిత్ర చిద్రం కాకుండా భద్రపరచినవాళ్లం అవుతాము.

## మరికొన్ని సూచనలు

1) అనుబంధ ఆలయాలైన ముక్కంటేశ్వర, వేణుగోపాలస్వామి ఆలయాలను దేవాలయ పరిధిలోకి తీసుకురావాలి. వాటి చుట్టూ రక్షణగా గోడ నిర్మించాలి. సందర్శనకు అనువుగా బాట వేయించాలి. వాటి ఆవరణను శుభ్రం చేయించాలి. కళ్యాణమంటప నిర్మాణం చేయాలి. రసాయన ప్రక్షాళన చేసి మసి మరియు సున్నంలాంటివి తొలగించాలి.

2) వేణుగోపాలస్వామి ఆలయానికి తక్షణమే మరమత్తులు చేయించాలి. దానికి కూడా రక్షిత కట్టడాల జాబితాలో చోటుకల్పించాలి.

3) గ్రామంలో మరేమైనా శాసనాలూ, నాణేలు, సమాచారం వున్నాయేమో సేకరించాలి. ఈ విషయమై గ్రామంలో తగినంత అవగాహనను కల్పించాలి.

4) గంగాదేవి చెరువును బాగుచేయించుకోవాలి. దాని ప్రాశస్త్యాన్ని వెలుగులోకి తేవాలి.

5) గ్రామాన్ని గురించి, ఆలయాన్ని గురించి వాడుకలోని కథలు, కైఫియత్తులు, సాహిత్య రచనల కోసం మరింత ప్రయత్నించాలి.

6) సందర్శకులకు అందుబాటులో వుండేలా ఆలయ చరిత్ర, ప్రత్యేకతల గురించి వివరణలు రాసిన ఫలకాలను ఏర్పాటు చేయాలి

7) ప్రాథమికంగా తయారైన ఈసమాచారానికి సవరణలూ, పూరణలు, అనువాదం చేసి ఆలయచరిత్రను మరింత అందుబాటులోకి తీసుకురావాలి.

8) ఆలయానికి సంబంధించిన వివరాలతో ఒక వెబ్‌సైట్ తయారుచేసి నిర్వహిస్తే బాగుంటుంది.

9) దేవాలయానికి అనుబంధంగా ఆర్థిక వనరులను, మానవ వనరులనూ తగినంత పెంపుదల చేసి పునర్వైభవానికై యత్నించాలి.

# సంప్రదించిన గ్రంథాలు

1) కాకతీయులు – పి.వి పరబ్రహ్మశాస్త్రి
2) ఆంధ్రదేశ చరిత్ర సంస్కృతి – బి.ఎన్.శాస్త్రి
3) తెలంగాణా చరిత్ర – సుంకిరెడ్డి నారాయణ రెడ్డి
4) ఆంధ్రుల చరిత్ర – బి.యస్.యల్ హనుమంతరావు
5) కాకతీయ సంచిక – ఆంధ్రేతిహాస పరిశోధన మండలి
6) తెలంగాణ శాసనములు:1 – లక్ష్మణరాయ పరిశోధక మండలి
7) తెలంగాణ శాసనములు:2 – ఎడిటర్ గడియారం రామకృష్ణ శర్మ
8) నృత్యరత్నావళి – జాయన సేనాని
9) ప్రతాప చరిత్రము – ఏకామ్రనాథుడు
10) ఎనిమిది శతాబ్దాల రామప్ప – సంపాదకులు డాక్టర్ ద్యావనపల్లి సత్యనారాయణ
11) రామప్ప దేవాలయము – శిల్పకళారహస్యము : సి.హెచ్.వీరభద్రయ్య
12) ఓరుగల్లు అసలు చరిత్ర – ఆచార్య హరిశివ కుమార్
13) కాకతీయ వైభవము – ఆచార్య హరిశివ కుమార్
14) రామప్ప గుడి గైడు – మందల మల్లారెడ్డి
15) ఆంధ్రదేశంలో శిల్పకళా వైభవం – డాక్టర్ ముప్పాళ్ళ హనుమంతరావు
16) దక్షిణభారతంలో దేవాలయాలు – కె.ఆర్.శ్రీనివాసన్
(అనువాదం: వాకాటి పాండురంగారావు)
17) శిల్పరాగం – కాశీభట్ల విశ్వనాథం
18) కాకతీయ తరంగిణి – యార్లగడ్డ వెంకట సుబ్బారావు
19) శైవసర్వస్వము (1942) – పండిత ముదిగొండ కోటయ్య శాస్త్రి
20) Select Kakatiya Temples – Dr Maremanda Rama Rao
21) Kakatiya Coins and Measures – P.V.Parabrahma Sastry
22) Folk Etymology Dictionary (1882) by Rev.A.Smythe Palmer
23) The Sculpture of the Kakatiyas – S. Gopalakrishna Murthy
24) The Ghanpur Group of Temples – Dr. Y. Gopala Reddy

# కృతజ్ఞతలు

**పురాణమిత్యేవ న సాధు సర్వం**. పాతదైనంత మాత్రాన ప్రతిదీ గొప్పదేం కాదు. అలాగని మెరిసేదంతా బంగారమూ కాదు. తాతల కాలం నాటి కిటికీ అనుకుంటూ మూసిపెట్టి భజన చేస్తే ఏమొస్తుంది? శుభ్రం చేసి బార్లా తెరిస్తేనే కదా స్వచ్ఛమైన గాలి లోపలికొస్తుంది? స్థానిక చరిత్రలను నాస్టాల్జిక్ అనుభూతి కోసమే వాడుకుంటే సరిపోదు. చరిత్ర నేర్పే పాఠాలను అర్థం చేసుకుంటూ, వర్తమానం లోని వాస్తవానికి అన్వయించుకుంటే ప్రగతికి మేలు జరుగుతుంది.

1998లో ఉపాధ్యాయుడిగా ఉద్యోగ బాధ్యతలలోకి వచ్చిన తర్వాతనుంచి ఈ ప్రాంత మిత్రులు అర్వపల్లి వీరాస్వామి, ధనమూర్తి, బండి శేషయ్యగార్లతో కలిసి ఈ దేవాలయాన్ని సందర్శించినప్పుడల్లా ఈ బృహత్తరమైన నిర్మాణాలను, వాటివెనకున్న నిపుణతను చూసి అబ్బురపడటంతో పాటు, ఖమ్మం జిల్లాకు చరిత్ర క్రోడీకరింపబడలేదేమని బాధపడేకంటే ఒక్క అడుగు నా ఓపిక మేరకు నేనే వేయటమే సమంజసం. ఆ తర్వాతే మరికొన్ని అడుగులు కలవాలని కోరుకోవడంలో అర్థం వుంటుందికదా. అందుకే సైన్సు, సాహిత్యం నేపథ్యం నుంచి వచ్చినవాడినైనప్పటికీ, చరిత్రను శ్రద్ధగా చదవటం, అర్థం చేసుకోవడం చేస్తూ ఔత్సాహికుడిగా పనిని ప్రారంభించాను. ఈ ఆలయం గురించి పేర్కొన్న రచనలు కానీ శాసన పాఠాలు కానీ ఏవీ ఇప్పటికీ దొరకలేదు. సరే, మొదటిప్రయత్నం చేయడం కూడా మంచి విషయమేగా అనే ఉద్దేశం తోనే ఇలా మీ ముందుకు వచ్చాను.

ఈ క్రమంలో గుడి వివరాలను దానితోపాటు తను పారంపర్యంగా తెలుసుకున్న సంగతులను ఓపికగా వివరించిన దేవాలయ పూజారి శ్రీ దేవులపల్లి శేషగిరిశర్మ గారు మరియు వారి తండ్రి శివరామయ్య శర్మ గారికి ప్రత్యేక ధన్యవాదాలు.

అనేక సందేహాలను నివృత్తిచేసిన శ్రీ రామోజు హరగోపాల్ గారు, ఎన్. వేణుగోపాల్ గారు, వేముగంటి రఘునందన్ గారు, వేముగంటి మురళీకృష్ణ గారు, మా గురువు గంగుల బాబుగారు అలాగే శాసన పాఠాలను ఎలా అర్థంచేసుకోవాలి? పరిష్కృతమైన శాసనాలను ఎక్కడ సంపాదించాలి లాంటి వివరాలు అందజేసిన శ్రీయుతులు ఎం.నారాయణ శర్మ, శ్రీ సంగిశెట్టి శ్రీనివాస్, శ్రీ గుర్రం సీతారాములు గార్లకు...

దేవాలయ పునర్నిర్మాణంలో ప్రముఖ పాత్ర పోషించిన, అప్పటి సి.ఐ ప్రతాపరెడ్డి గారిని ఫోన్ద్వారా సంప్రదించినప్పుడు ఆప్యాయంగా ఆ సంగతులన్నీ తెలియజేసినందుకు,

దేవాలయాన్ని క్షుణ్ణంగా పరిశీలించడం కోసం నాతో పాటు కలిసి తిరిగిన మిత్రులు

అర్వపల్లి వీరస్వామి, ధనమూర్తి, బండి శేషయ్య, రామకృష్ణ, భాస్కర్ కొం(డెడ్డి గార్లకు...

గుడిపరిశీలన, రామప్ప, కోటగుళ్లతో సరిపోల్చటం ప్రూఫ్‌రీడ్ ఇలా ప్రతివిషయంలోనూ తన సమయాన్ని నాకోసం కేటాయించిన కవిమిత్రుడు నందకిశోర్‌కు ప్రత్యేక కృతజ్ఞతలు

ఇలా చేయబోతున్నానని చెప్పగానే వెన్నుతట్టి ప్రోత్సహించిన శ్రీయుతులు సుంకిరెడ్డి నారాయణ రెడ్డి గారు, జితేంద్రబాబు గారు, గణపేశ్వరాలయ చరిత్రపై ఇదే దేవాలయ ఆవరణలో ప్రాసంగిక వివరణ కార్యక్రమాన్ని ఏర్పాటు చేసి నాచేత మాట్లాడించిన '**అమ్మఒడి**' సంస్థ నిర్వాహకులు శ్రీ సాధనాల వెంకటస్వామినాయుడు, సోదరుడు లెనిన్ శ్రీనివాస్, రాజశేఖర్ గారు, బావ పోతగాని సత్యనారాయణ,తదితర మిత్రులకు...

రిఫరెన్స్ కోసం అనేక పుస్తకాలలో సమాచారాన్ని వెతుక్కోవడానికి సహకరించిన సత్తుపల్లి గ్రంథాలయ లైబ్రరియన్, మరియు సృజన సాహితీ సమాఖ్య నిర్వాహకులు శ్రీ జి.రామకృష్ణ, బోడేపూడి విజ్ఞానకేంద్రం నిర్వాహకులు మా బాబాయ్ శ్రీ కపిల రాంకుమార్ గారూ,హైదరాబాద్ యస్వీకే గ్రంథాలయానికి...

పుస్తకం పని త్వరగా పూర్తయ్యేందుకు తన ల్యాప్‌టాప్‌ను ఇచ్చిన అన్నయ్య కవియాకూబ్ గారికి, టూరిజం మీద నాకు ప్రత్యేకశ్రద్ధ ఏర్పడేందుకు కారణం అయిన బావమరిది యం.కృష్ణసుమంత్ అసిస్టెంట్ ప్రొఫెసర్, టూరిజం మేనేజ్‌మెంట్ కాకతీయ విశ్వవిద్యాలయం గారికి,

నాకు వెన్నంటి సహకరించే నా సతీమణి లక్ష్మికి, పిల్లలు రక్షితసుమ, సుప్రజిత్ రామహర్షలకు, తమ్ముడు కట్టా జ్ఞానేశ్వర్, నాగలక్ష్మిలకు, అమ్మ కట్టా లీలావతికి,

వివిధ సందర్భాలలో చాలా విషయాలను చెప్పిన గ్రామస్థులు, పుస్తకాన్ని సకాలంలో ఇంత అర్థవంతంగా తయారుచేసి ఇచ్చిన మిత్రులు కంప్యూట్ గ్రీన్ నిర్వాహకులు సురేష్ అబ్దుల్ వాహెద్ గారికీ, మరియు ఇతర మిత్రులకూ పేరుపేరునా ధన్యవాదాలు.

**కట్టా శ్రీనివాస్**

**9885133969**

nivas.katta74@gmail.com

www.antharlochana.blogspot.in